# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు :
డాక్టరు కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

ఫిబ్రవరి, 1948.

సంపుటము ౧౭]  [సంచిక ౨




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక

# శ్రీ సర్వజిత్ నామ సంIIర మాఘమాసము

| | | | |
|---|---|---|---|
| | 11 | బు | పా. 6-58 శత 55-4 దివ 8-52 మాఘస్నాన వ్రతారంభం. |
| | 12 | గు | వి. 11-23 పూభా దివ 12-21 |
| | 13 | శు | త. 15-10 పూ 0 11 ది 26-1 |
| | 14 | శ | చ. 8-7 ఉభా పంచమి తిథిః డుండిగణపతివ్రతం. |
| | 15 | ఆ | ప. 20-2 రే 8-7 తాజ్యాభావః శూన్యతిథిః |
| | 16 | సో | ష. 20-46 అ 10 ది 0-4 షష్ఠితిథిః సుబ్రహ్మణ్య షష్ఠి. |
| ఫిబ్రవరి | 17 | మం | స. 20-15 భ 11-14 రథసప్తమీ అంభోజార్క వ్రతం. |
| | 18 | బు | అ. 18-28 కృ 11-38 నవమితిథిః, భీష్మాష్టమి. |
| | 19 | గు | న. 15-29 రో 10-25 తిరుకచ్చినంబి తిరునక్షత్రం. |
| | 20 | శు | ద. 11-25 మృ 8-6 దివ 28-2 |
| | 21 | శ | ఏకా. 6-26 ఆర్ద్రా 4-54 సర్వేషామేకాదశి భీష్మైకాదశి. |
| | 22 | ఆ | ద్వా 0-45 పున 0-58 దివ 19-30 |
| | 23 | సో | చతు. 48-8 ఆశ్రే దివ 26-2 తిరువత్తూరు పొగడమాను సేవ |
| | 24 | మం | ○ పౌ. 41-47 మ 47-24 దివ 19-31 వ్యాసపూజా. |
| 1948-వ సంII | 25 | బు | పా. 35-50 పూఫ 43-16 |
| | 26 | గు | వి. 30-29 ఉఫ 39-46 దివ 0-6 |
| | 27 | శు | త. 25-57 హ 37-7 |
| | 28 | శ | చ. 22-26 చి 35-31 రా 20-6 |
| | 29 | ఆ | పం. 20-4 స్వా 35-3 తిథి ద్వయం. |
| | 1 | సో | ష 18-55 విశా 35-48 సప్తమితిథిః |
| | 2 | మం | స. 19-2 అనూ 37-46 అష్టమితిథిః |
| | 3 | బు | అ. 20-21 జ్యే 40-53 శూన్యతిథిః. |
| | 4 | గు | న. 22-47 మూ 45-2 దివ 2-9 |
| మార్చి | 5 | శు | ద. 26-9 పూషా 50 దివ 10-56 |
| | 6 | శ | ఏకా. 30-15 ఉషా దివ 11-47 |
| | 7 | ఆ | ద్వా. 34-49 శ్ర 60-10 దివ 6-30 |
| | 8 | సో | త్ర. 38-53 శ్రీ 1-38 దివ 12-41 మహాశివరాత్రి శ్రీశైలాది శివక్షేత్రే అభిషేకం. |
| | 9 | మం | చతు. 44-19 ధని 7 50 దివ 27-34 |
| | 10 | బు | ● అమా. 48-41 శత 3-29 అమాతర్పణం. |



బాపూజీ ఎక్కడికి .... ?




జయజయ గృహలక్ష్మీ సఖీ ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా !
జయజయ లలనారత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయ కల్యాణీ !

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయం త్యాపో నశోషయతి మారుతః.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ
నిత్యస్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః.

అవ్యక్తోయ మచిన్త్యోయ మవికార్యోయ ముచ్యతే
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి.

జాతస్యహి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్తనిధనా న్యేవ తత్రకా పరిదేవనా.

— భగవద్గీత

# మహాత్ముని నిర్యాణము



మహాత్ముఁడు నిర్యాణమందినాడు. అయితే అది మానవ సహజమైన మరణము కాదు; బలవన్మరణము. ఒక హంతకుని పిస్తోలు కాల్పులకు గురియై మరణించినాడు. కావున గొప్పవెలుగు హఠాత్తుగా ఆరిపోయినట్లు ప్రపంచమంతట గాఢాంధకార మలుము కొన్నది. అందుచే భారతీయులేగాక ప్రపంచమందలి వివిధ జాతులవారందరును హాహాకారము లొనర్చుచున్నారు.

యోచింపఁదగినది. ప్రపంచమున మహాత్ముల నిర్యాణమున కిది యొకమార్గమా అని తోచుచున్నది. పౌరాణిక కాలమున శ్రీ కృష్ణుఁడు బోయవాని అంబునకు గురియైనాడు. చారిత్రకయుగమున సోక్రటిస్ తానునమ్మిన సత్యమునకై రాజ్యాధిపతి దండనమేరకు విషముత్రాగి కీర్తిశేషుఁడైనాడు. క్రీస్తుదేవుఁడు తనశిలువను తానుమోసుకొనివెళ్లి దానిపైననే మరణదండన స్వీకరించినాడు. సెయింట్ థామస్ అను క్రైస్తవఋషి మన చెన్నపురిలో సెంట్‌థామస్ మౌంటువద్ద బల్లెపుపోట్లుదిని వీరమరణము గాంచెనని గాథలు గలవు. రోమకసామ్రాజ్యమును, దానికీర్తిని పలుదేశములకు వ్యాపింపజేసిన సీజర్‌చక్రవర్తి తన ముఖ్యానుచరులచేతనే హత్యగావింపబడినాడు. దైవప్రేరితమగు వీరావేశమున పసులకాచుటవిడిచి రాజసేనల నడిపి పరాసుదేశమునకు పరాధీనతతొలిగించిన వీరనారి జోన్ ఆఫ్ ఆర్క్ శత్రుహస్తగతయై చితిపై బ్రతికియుండగనే దగ్ధమొనర్పబడెను. అబ్రహాంలింకను మహాశయుడు అమెరికాయందలి అంతఃకలహము నడంచిన ఆరునెలలకు ఇట్లే యొక వెర్రియువకునిచేత హత్యగావింపబడెను. స్వామీ శ్రద్ధానందుడును ఇస్లాంమతోద్రేకి పిస్తోలున కెర ఆయెనుగదా. ఇట్లు స్వదేశస్వాతంత్రమునకై పోరాటములు నడిపిన వీరులును, మానవజాతినైతికోన్నతికై పాటుబడిన ధర్మవీరులును ఈ మార్గముననే స్వర్గారోహణ మొనర్చియుండగా ఉభయమునైన మనమహాత్మునును ఆపథముననే జని అమరలోకము నలంకరించుట వింతగాదు. అయితే అట్లని మనస్సునకు ఊఱట కలుగుట లేదు. ప్రపంచ హృదయమున కుములుచున్న విషాదాగ్నిని, వియోగభారమును సహస్ర ద్వారముల వెడలఁగ్రక్కినగాని-మానవలోకము తిరిగి స్థిమితపడదు. అదియే యమునా నదీతీరమున పదిలక్షలజనము కంటికిమంటికి ఏకధారగా విలపించుటకంతరార్థము; అదియే ప్రపంచమంతట నాగరికులు రేడియోలముందు కూర్చుండి ఢిల్లీ ఏడ్పుల ప్రతి

ధ్వనితో మేళవించి ఆక్రోశించుటలోగల రహస్యము; అదియే ఈ నాల్గురోజులుగా ఈ భూమిపై మూలమూలలగల కుగ్రామములలోను అశేషప్రజయు దిక్కుతెలియక వాపోవుటకుమూలము.

అయితే ఇకనిట్లు విలపించుటతోనే కాలము గడవ వలయునా? ఆ సంగతి "గృహలక్ష్మి"కి చెప్పనక్కరలేదు. విగతజీవులకై కనుకొలకుల నొకచేత తుడుచుకొనుచు మరియొకచేత ఇల్లుచక్కబెట్టుకొనుట ఆమెకలవాటే. భారతప్రజయు చిన్నాభిన్నమై యున్న భారతసంసారమును చక్కబెట్టుకోవలయును. ప్రపంచమందలి వివిధదేశముల పెత్తనదారులును ప్రపంచవ్యవహారము నటులే సరిదిద్దవలెను. ఆ సంగతినే భారతరాజకీయ వేత్తలు ప్రకటించుచున్నారు. దానికే బ్రెయిల్సుఫర్డు గాంధిస్మారక చిహ్నముగా రష్యాతో రాజీచేసుకొనుడని ఆంగ్ల అమెరికా దేశములను కోరుచున్నాడు. అమెరికాలో హోమ్సు ఆటంబాంబులా? మహాత్మాగాంధీ మార్గమా? ఏదికావలయునో నిర్ణయించు కొనుడని ప్రపంచజాతులను హెచ్చరించుచున్నాడు. ఈ దారుణము జరుగకమున్నే ఆటం బాంబులనన్నిటిని ధ్వంసమొనర్చి—ఆటంశక్తి నందరము కలిసి ప్రజోపయుక్తముగా వినియోగింతము-అని రష్యాసూచించినది. అట్టిహృదయ పరివర్తనము ప్రపంచపు పెత్తన దార్లకు కలిగినప్పుడు—పాకిస్థానపు గొడవ యొక సమస్యయేకాదు. అట్టి సంకల్పము ప్రపంచసభారంగమున ఉదయించినప్పుడు—అమరజీవి మహాత్ముడు వెన్నంటివచ్చి దారి చూపును. ఏమందురా, ఇంతకు హత్యగావింపబడిన దాశుష్కదేహము; దగ్ధమొనర్ప బడిన దాజీర్ణశరీరము. మహాత్ముని ఆదర్శములు సిద్ధాంతములు, ఎల్లరకు కొంగుబంగారమై యున్నవిగదా.

అయితే నేడుగావలసినది పరిశుద్ధమగు వాక్కు; అట్టిచర్య. ఇకబూటకమువల్ల ప్రయోజనములేదు. వాత్సల్యమున మనబూటకములనన్నిటిని కప్పిపుచ్చి మనల కాపాడు మహాత్ముడు దేహముచాలించినాడు. తన శక్తియుక్తులకు తగినమేరకే ఆయన సిద్ధాంత ములను-ఆదర్శములను అవలంబించి, అంతకన్న హెచ్చుగా వానినవలంబింప శక్తి యుక్తులు కలుగవలెనని సాధనమొనర్చుచో మహాత్ముని ఆత్మ హర్షించును; దైవము మెచ్చును. నిజముగా నట్టి శక్తియుక్తులు క్రమముగా మనకలవడగలవనియు మా విశ్వా సము. ఇట్టి స్థితి ప్రపంచమున అమలుజరుగుట ముఖ్యముగ స్త్రీలపై ఆధారపడియున్నది. వారు నిజశక్తి తెలిసి నిరాడంబరముగ నడుచుకొనుట కలవాటుపడినవారు. 'తన సిద్ధాంత

ములను న్యాయముగ సాధనగావింపగల నేర్పరులు స్త్రీలే, యని పలుమారు మహాత్ముడే చెప్పియున్నాడు.

వింత ఏమోగాని—ఇరువురిబాలికల, నాధారముచేసుకొని నడుచుచుండగా—మహాత్మునికీవిపత్తు సంభవించినదట. ఆబాలికలును అట్టిభయోత్పాతమగు విపత్కాలమునను—మహాత్ముని పట్టువిడువక ధైర్యముగా నిలువబడియుండి భారతనారీలోకమునకు కీర్తి తెచ్చినారు.

శ్రీ మాతా కస్తూరిబా పాతివ్రత్యమాహాత్మ్య మెట్టిదోగాని—ఆమెగతించి (ఫిబ్రవరి 22 వ తేది) 4 సం॥ నిండకముందే స్వర్గధామమున భర్తృసమాగమమామెకు సిద్ధించినది.

ఈ విషాదవార్తకు జనసామాన్యమున కొందరు మతిపోయి నిరపరాధులను బాధించుట మహాత్మునికపచారముగావించులే. మహాత్ముడీ విపత్తును గడిచియున్నచో ఆదురంతకునే క్షమించియుండువాడు. వెనుక ఆయన దక్షిణాఫ్రికాలో తనపై దౌర్జన్యమొనర్చిన యూరపియనులను, పఠానుసోదరునిక్షమించి, వారిపై సాక్ష్యముచెప్ప నిరాకరించి వారిని మిత్రులనుగావించుకొనెను. మొన్నమొన్న బాంబు ప్రయోగించిన వానినికూడ క్షమింపుడని చెప్పియుండెను. :"తండ్రీ, వారేమిచేయుచున్నారో, వారెరుగరు గానవారిని క్షమింపుము" అన్నక్రీస్తుపలుకుల యందాయన కాదరణమెండు.ఆయన ధర్మ మీమాత్రమైన మనమవలంబింపరాదా ?

విగతజీవులగూర్చి వారిఆత్మలకు శాంతికలుగుగాక యనికోరుట మామూలుమాట. కాని మహాత్మునివిషయము అట్టిదికాదు. ప్రపంచమున యుద్ధములు, యుద్ధకారణములు నశించి శాంతినెలకొల్పబడిననాడే—మహాత్ముని ఆత్మకు శాంతి. ఆవిధముగా వారిఆత్మకు శాంతికల్గుగాక యనికోరుచున్నాము.

—కే. ఎస్. కేసరి.



# బాపూజీకి బాష్పతర్పణము

ఎన్నియుగాలకీ కొరతయెవ్విధి దీరును భారతాంబకున్
కన్నరుణంబుదీర్చ వరగాంధి నశించె నటంచునెంతో, యీ
చిన్నలుపెద్దలిట్లు విలపించెడిరోజులు దాపురించె నిన్
కన్నుల గాంచలేక బ్రతుకన్ ఫలమేమి మహాత్మగాంధిజీ!

పాపపుచర్యలన్నిగని పావనదేహము నాహుతిచ్చి, యే
కోపములేక నేగితివి కోమలవాక్కుకలైన చెప్పకే!
రూపము లేనివస్తువు నిరూపణ జేయగ శక్యమౌనె, యీ
యాపదకెట్టులోర్తునో యాసలువీడి మహాత్మగాంధిజీ.
ఎవ్వరికెట్టికీడు గలనైనదలంచి యెరుంగవీవు, నీ
దవ్వునకెట్లు వచ్చె యతిదారుణ బాంబు లిదేమి పాపమో!
పువ్వునుబోలు నీతనువు బూడిదపాలొనరింపజేసె, నీ
నవ్వుమొగంబు నేమరువ నాతరమౌనె? మహాత్మగాంధిజీ!

ఆ దినమంతవేచి తగుయానతికై మదరాసునందు, నీ
పాదములందువ్రాలిన సుభావముతో చిరునవ్వునవ్వి, న
న్నాదరవాక్కులన్ తనివి నందగ జేసిన సత్యమూర్తి, నా
కేదరిజూపకేగితివి యేమనుకొందు మహాత్మగాంధిజీ!

నలువదియేడులుందువను నమ్మకమంతయు సున్నయయ్యె నిజ
బలిమి వరించి మృత్యువు గభాలున నెత్తుకపోయెనయ్యొ, నా
తలచు తలంపులన్నియిక దబ్బరలాయెగ సాధుమూర్తి, యే
కలతయులేని నీమొగము గాంచుటికెట్లు మహాత్మ గాంధిజీ!

యెర్నేని శేషమాంబ.



అల్లదే భారతాకాశమందువెల్గు భానుడస్తంగతుండయ్యె పశ్చిమాబ్ధి
తెరలిదుఃఖంబు వ్యాపించె దిక్కులందు ప్రబ్బికొనియె చీకట్లు నభంబునెల్ల.

భారతస్వాతంత్ర్య భండనంబున నూత్న మార్గంబుజూపిన మాన్యతముడు
దీనజనావన దీక్షగైకొని కూర్మి హరిజనంబుల బ్రోచు పరమగురుడు
భారతజననికై భాగ్యభోగ్యంబుల త్యాగంబొనర్చిన ధన్యమూర్తి
సత్యశాంతంబులె సాధనంబులుగాగ సమరంబు గావించు సైనికుండు
అఖిలదేశాల జనచయం బబ్బురముగ సన్నుతింప స్వతంత్రత సంతరించి
యింతలో చింతలో ముంచి యేగినావె అక్కటక్కటా యింకనే మనగ వలయు.

పరతంత్రంబును దూల్పగ నిరతము కృషిసల్పి మిగులనేరుపుతోడన్
చిరదాస్యంబును బాపిన పరమగురూ "గాంధి" యిట్లు పడి పోయితివే ?
సత్యంబును హింసారాహిత్యంబును నాత్మఁగోరి హితమతి దేశా
న్నత్యంబు పెంపుఁగోరెడు సత్యరతున్ "గాంధి" బాసి, చనునే మనగన్ !

అదిగో నెహ్రూనీడు సలహాలకై వచ్చె నాతనితోడ మాటాడవేల ?
సంస్థానవిషయముల్ చర్చింపనరుదెంచు వల్లభాయినిజూచి పలుకవేల ?
రాజేంద్రుడరుదెంచి రాజకీయంబుల విన్నవించెడు నదే వినవదేల ?
ముదితసరోజిని ముచ్చటింపగవచ్చె కన్నెత్తి యామెను గాంచవేల ?
యాంధ్రకేసరి, పట్టాభియరుగుదేర వారి క్రీగంటజూడగా గోరవేల !
అంగదా ! మమ్ము దుఃఖాబ్ధి క్రుంగజేసి కన్నుమూసితె యింతలో కన్నతండ్రి !
నీదు యెడబాటు సైపక నిన్నుజూడ మాతకస్తూరి బిలచెనో ప్రీతితోడ
చెప్పకుండంగ నేగితి చెంతనున్న బిడ్డలకునైన బాపూజీ ప్రియమువీడి.
"హిందుముస్లిములత్యంత హితులుగాగ నైకమత్యంబు సమకూర్ప నైతిగాన
కలియుగంబున నికనుండగష్టమనుచు" తరలిపోయెను ; మా "గాంధి" తరలిపోయె !

దేశిరాజు భారతీదేవి.



మనదేవుడు మనయేలిక మనజనకుడు గురుడు హితుడు మాన్యుడు జగతిన్
మనగాంధి మహాత్ముడకట ! మనలను విడనాడిచనియె మనపాపమునన్ .

మనభారత ప్రియతనయుడు మనజాతికి జీవగఱ్ఱ మననేత యహో
మనపాలి కల్పవృక్షము మనలను విడనాడి వెడలె మనుటెట్లోయికన్ ?

ప్రాణగొడ్డంబైన బన్నంబువచ్చిన ధర్మంబు మీరని ధర్మమూర్తి ;
దేశకార్యములెన్ని తీర్చుచు నుండిన సత్యంబు వీడని సత్యవాది;
అహితాత్ములెంతెంత యారడిబెట్టిన సహనంబు వీడనిసాధుతముడు;
హింసా పరాయణులెంత హింసించిన ప్రతిహింస కోరని యతి దయాబ్ధి;

పేదసాదల పాలిటి ప్రేమమూర్తి; మధుర భాషల మనుజుల మనుచు ఘనుడు;
అతులసేవాప్రియుడు పూజ్యు డమృతమూర్తి మనమహాత్ముండు లేడుగా ! మనకు లేడు !

స్త్రీపురుష విభేద సేతలు తగవని సమతత్వబోధలు సలిపినాడు;
ఉన్నతోద్యోగము లువిదల కిప్పించి స్త్రీజన బంధువై చెలగినాడు;

చెనటుల చేజిక్కి చెడినట్టి స్త్రీలను కనికరంబునజూచి కాచినాడు;
నిరపరాధలు వారు నిందింపబోలరు చేరదీయుడటంచు చెప్పినాడు;
కోటి యిర్వదిలక్షల గొప్పధనము మాత కస్తూరిపేరిట మనకుగూర్చి
గ్రామస్త్రీలను బ్రోవంగ గడగినాడు; మనమహాత్ముని యుపకృతి మఱవ వశమె?

అన్నమో రామయని పేదలలమటింప
కూడుగుడ్డకు కంట్రోలు కూడదనుచు
ధీరతనంబున వాదాడి దొలగజేసి
పిడికెడన్నంబు పేదకు పెట్టిపోయె
నరుడె; మనగాంధి దేవతావరుడు కాడె?
సతత యుపవాసవ్రతశీలి సాధుతముడు
సకలలోకైక దేశికచక్రవర్తి
భారతీయ హృద్గగన ప్రభాకరుండు
అస్తమించెను; చీకటు లలమె జగతి.

కనుపర్తి వరలక్ష్మమ్మ.

●

నీ చిరునవ్వులో నిరతంబుకన్పట్టు మానవాదరణంబు మరువగలమె?
నీకనుమోడ్పులో నిరతంబుజూపట్టు మాధురిప్రేమలు మరువగలమె?
నీచేతిగీతలో నిరతంబు వినిపించు మతబోధ లెడ్డైన మరువగలమె?
నీప్రార్థనంబులో నిరతంబు జపియించు మతసామరస్యంబు మరువగలమె?
అట్టిమమ్మిట్టునట్టేటి కిట్టెనెట్టి ఎటిగట్టును జూపెట్ట కట్టె జనితి
ఇట్టినట్టేట గట్టెట్టు-బట్టగలము కట్ట! ఎట్టెని ఇప్పట్టు గట్టుచూపు!

"దీక్షి-దేవి"

●

మాయమైతివా గాంధీ!
మమ్మిక విడచి పోతివా!
భారతజాతికి భారతీయులకు
నీవొక జోతిగ వెలిగీ.... వెలిగీ...
మాయమైతివా గాంధీ!
మమ్మిక విడచి పోతివా!

జన్మభూమికై జన్మించితివీ
జన్మభూమికై మరణించితివీ
దేశదాస్యమే తీర్చిపోతివీ
మాయమైతివా గాంధీ!
మమ్మిక విడిచి పోతివా!

దేశమంతా దుఃఖాంబుధి ముంచీ
మాయమైతివా గాంధీ!
మమ్మిక విడిచి పోతివా!
శాంతిసమతపూ శంఖారవములు
జగతి నంతనూ నింపీ... నింపీ
మాయమైతివా గాంధీ!
మమ్మిక విడిచి పోతివా!
హిందూ ముస్లిం ఐక్యతకొరకై
నీప్రాణాలను విడనాడితివా
మాయమైతివా గాంధీ!
మమ్మిక విడిచి పోతివా!
జగమంతా నీస్వగృహమేనని
జనులంతా నీసోదరులేయని
చాటి చాటి తుదకిట్టులైతివా
మాయమైతివా గాంధీ!
మమ్మిక విడిచి పోతివా!

"కిరణ్"

ఇ క
గాం ధీ
ఏ డీ?
మ న
నే త
మ న
హి త
మ న
సి త
ఏ డీ ?
అ య్యో !
అ థో గ తి
పా లొ న రిం చె న్
మ న ల ను
తా—
వీ ర స్వ ర్గ ము
న లం క రిం చె న్
దో—

గాం ధీ జీ
ఇ క లే డు
గ దా !
మ న
బా పూ జీ
ఇ క రా డు
గ దా
అ య్యో! ఎం త టి
దుర్దినమిది
ప్రపంచమంతటికీ
దుర్వార్తా శ్రవణం;
శాంతిదూత మరణం!
ఇంకెక్కడిశాంతిలే- ?
ఇదిదేశానికి విలయం;
ఛీ! ఛీ -
గాంధీజీ హత్యా-?
అదెట్లా —
మమ్మాటికి-కాదు-గదా
అది వీరోచిత మరణం!
మం. సు. శ.

హర! హర! ఘోరవార్త విననాయెఁగదా! మహితాత్మ గాంధి దు
ర్మరణముఁజెందె, భారత రమామణి శోకవిలీనయయ్యె; సో
దరులు నిరంతదుఃఖ పరితప్త మనస్కులు; అంధకార బం
ధురము జగమ్ము; సు మ్మెదియుఁదోఁచదు; కార్యపథ మ్మదృశ్యమే!

భారతవాసివా? చలనభావ! యి ట్లొనరించినావురా?
క్రూర! మహాత్ము ప్రాణములఁ గొంట జగజ్జన కంటకంబురా!
సైరణసేయ రెవ్వరు నిజమ్ము, త్వదీయ కృతమ్ము పమ్ము, భూ
భారము దీఱఁ శిక్షలను బొల్పడుమా యికమానవాధమా!

హిందూ మతస్థుఁడవెరా? పందా! బాపూజిఁ జంపఁ బాల్పడితివిరా!
ఎందుండి వచ్చితివిరా? ఎందఱు నిన్ బంపిసారొ యెఱింగింతువురా!

గాంధినిం జంపఁజాల; వొకండుగాఁడు; భారతీయాంతరంగ నివాసియతఁడ;
జాతి మతభేద రహిత విచక్షణుండు భాగ్యజీవి బాపూజి విశ్వస్వరూపి.

శ్రీమతి చదలవాడ నాగరత్నము

●

స్వారాజ్య సౌధసుస్తంభ మెత్తెనెవండు యశముచేహ్వా తుక్కశేశయముచేత;
అసహాయువాదన వెసజూఁపె నెవ్వాడు వాక్కుచే సుజన విభాక్కుచేత;
ఇల నహింసా, శాంతి నెలకొల్పె నెవ్వాడు తనువుచే వాఙ్మనోధనముచేత;
భారతజనని దాశ్యమును బాపె నెవండు శాంతిచే అనుపమ దాంతిచేత;
అతులపూజ్యుండు నిర్మలుండార్యనుతుడు భరతమాత సుపుత్రుండు భవ్యకీర్తి;
ఆత్మసంవేది గాంధీమహామునీంద్రు నకట అర్పించితిమి ఒక్క అంతకునకు!

గంటి కృష్ణవేణమ్మ

●

ఏడీ మాకులదైవతం బనెడి వాఁడేఁడీ మతోద్ధారకుం
డేఁడీ మానయతత్వమూర్తియను వాఁడేఁడీ మహాత్ముండు మా
కేఁడీ మంచిని చెడ్డ చెప్పఁగలవాఁడేడీ మహావక్త మా
కేఁడీ తండ్రిగురుండటన్న మొఱనే దేదేవతల్ విందురో!

అయ్యయ్యో! మనగాంధి పోయెనని యీ యాబాల గోపాలమున్
మయ్యో మొఱ్ఱో యటంచు నేడ్వఁ దొడఁగెన్ గొంతెత్తి నల్దిక్కులం
దయ్యోనాదము లుప్పతిల్ల మదిఁ బ్రవ్యక్తిల్ జెందఁగా; లోకముల్
తియ్యంజూపులు తేలపోయెనని గాంధీదేవుకై యేడ్చెడిన్.

చే. సుబ్రమణ్యశర్మ

కటకట! వింటి మప్పుడుగుకంటెను దెట్టిదమైనవార్త హృ
త్పుటములు రెండుగాఁ జెదిరిపోవ; మహాత్ముఁడు గాంధి శాతిర్యే
కుటిలు తుపాకి కాల్పునకు గూలెనటన్న, మరెట్టిఘోర సం
ఘటనలు పొందఁగా గలుగుకాలమొ భారతదేశమాతకున్!

భారతశాంతిదూతవని, భారతభాగ్యవిధాతవంచు, ని
ర్ధారణి సర్వదేశవిబుధప్రకరంబు వచింప నక్కటా!
క్రూరకిరాత కృత్యమున గూలితివయ్య మహాత్మ! ఎవ్వరా
ధారము మాకు సర్వశుభదాయక మార్గము బోధ సేయగన్?

ఓయి! నిశాచరాధమ! శుభోదయ కారణమూర్తి, దేశసా
హాయము లాచరింప వెనుకాడని పండిన వగ్గు గాల్చ నీ
చేతులెటులాడెరా! కుమతి! చేతులలోఁ బెదబొబ్బపుట్ట నీ
కాయువుమూడివచ్చె! జగదావుల భారతకీర్తి మాపెరా!

రవియస్తంగతుఁడైన రేపెపొడుచున్ ప్రాగద్రిపై నూతన
చ్ఛవితో; నీ విపు డస్తమించితివి, తోచకారావు మాకంటికిన్
భువిలో నీ వవతారమూర్తివని సమ్మోదంబుగా బల్క, నీ
యవతారంబును బాసి యేగితె మహాత్మా! నీవు స్వర్గానికిన్.

హైందవమహమ్మదీయ కలహాలిక తగ్గునొ? లేక పోరు పెం
పొంది, వినాశనంబగునొ పూజితభారతదేశమెల్ల? నీ
వందఱి పట్లప్రేమహృదయంబుననుండిన కారణంబె నీ
కుం దుద కిట్లు చేకూరెను, క్రూరనిశాచరకృత్య మక్కటా!

ప్రాకటభారతీ మహితురాలగు కస్తురిబాయి పోవఁగా
వ్యాకులమానసంబున మహాదురవస్థల నందుచుండఁగన్
ఈ కఠినంపువార్త సహించునె? చుడఁగ గోరుచుట్టుపై
రోకటి పోటనంగఁ దగె రూఢిగ భారతదేశమాతకున్.

కౌరవద్రోహాలు సైరించుకొన్నట్టి ధర్మజుకంటె శాంతప్రభుండు;
జీవులకై తన జీవంబులొడ్డిన శాక్యునిమిం చహింసాపరుండు;
తనమేనికండలు ధారవోసిన శిబియవనీశుకంటెను త్యాగమూర్తి;
పలుకుచెల్లించిన యలహరిశ్చంద్ర భూతలపతికంటె సత్యవ్రతుండు;

పుడమికై యస్థిచర్మంబు, కడకు జీవములను వీడిన యవతార పురుషవరుఁడు;
మనలనెల్ల విచారవార్ధిని కలంచి, శాంతసౌఖ్యాలకై పోయె స్వర్గసీమ.

స్వర్గలోకాన కస్తూరిబాయితోడ చేరినావనుకొన్న, దుర్వారశోక
జలధికల్లోలముల్ దాటఁగలమె? ఉండఁగలమె? కులమతకలహాంధకారనిశల?
తాతాయని నోరారఁగఁ జేతులుపైకెత్తిపిలిచి, జేజేలిడఁగా
నోతుము మేమిక నే విఖ్యాతుని? శాంతిల్లునాత్మ గాంధీతాతా!

కవిచంద్రులు, కోట సోదరకవులు.

●

అంధకారం ... అంధకారం
ఎటుజూచిన విషాదం
ఎటువిన్నా శోకారవం
అశ్రుధారలు అంబుధులై
భూగోళం మునిగింది.

చిక్కని చీకటి తెలిలెన్నో
ఒక్క మారే అల్లుకొన్నై!

మతోన్మాద విషసీమలో
శాంతివృక్షం కూలింది.

ఆ శాఖల నాశ్రయించి
ఆ నీడను పవళించిన
అనాథుల తుది కేకల
ఆకాశం చిల్లులుపడి
జల్లెడలా తోచింది.

ఎటుపోవునో ఎటువచ్చునో!
ఏదిదారి? ఏదిదిక్కు?
భవిష్యత్తే అంధకారం!

కే. పభ

—★—

# మహాత్ముని తుది ప్రార్థనోపదేశము

●

బన్నునుండి 40 మంది శరణార్థులువచ్చి ఈ అపరాహ్ణమందు నన్నుచూచినారు. పాపము వారు చాలాకష్టదశలో ఉన్నారు. వారిలో నొకరు వారికష్టాలన్నీ నా వల్లవచ్చినవన్నారు, ఆగ్రహంతో 'మాఅవస్థ మేముపడుతాము; మీరు హిమాలయ పర్వతాలకు వెళ్లిపొండి' అన్నారు. 'ఎవరి ఆజ్ఞానుసారం వెళ్లమంటావు' అని అతనిని అడిగాను. కొంతమందికి కోపంవచ్చి నన్ను తిట్టినారు; కొంతమంది భూషించారు కూడ. నాకు వకటేమార్గం కన్పిస్తున్నది; హృదయాంతరాళంలోనుండి పలికే భగవంతుని ఆజ్ఞానుసారమే నడుచుకోవాలి. భగవంతుడొకడే మనకు నిజమైన స్నేహితుడు. హిమాలయాలకుపోయి ఆ శాంతిని అనుభవించడం నా కోరికగాదు; ఈ గందరగోళము మధ్యనే యుండి లభ్యమైనంత శాంతినే అనుభవిస్తాను

న్యూఢిల్లీ 29-1-48



రఘుపతి రాఘవ రాజారాం

పతితపావన సీతారాం.

ఈశ్వర అల్లా తేరేనాం

సబ్‌కో సన్మతి దే భగవాన్.

# "ప్రపంచ జ్యోతి ఆరిపోయినది"

మహాత్మాగాంధీ ప్రపంచానికంతా గొప్పవ్యక్తి అనీ, న్యాయము, ధర్మముశాంతి అనే ఆదర్శముల నేమాత్రము మన్నించేవాడైనా ఆయనను ప్రేమించి పూజించేవాడనీ దశదిశలనుండీ, అన్ని భాషలలో, ప్రపంచవాణి పలికింది. ఇక నేనేమిచెప్పేది!

—సరోజినీదేవి.

నేను, రాణి, గాంధీమృతివిని ఎంతో, క్రుంగిపోయినాము. కూడదీయరాని ఈనష్టంతో కుమిలిపోతున్న భారతజాతికి మా సానుభూతి; నిజానికీనష్టం వారికొక్కరికేకాదు; మానవజాతికంతా.

—బ్రిటిష్ రాజు.

గాంధీ గొప్పభారతజాతీయ నాయకుడు; దానితోపాటు గొప్పఅంతర్జాతీయ నాయకుడుకూడ. ఆయన బోధనలు, చర్యలు, కోట్లకొలది హృదయాలలో గాఢంగా అంకితమైయున్నవి. భారతీయులేగాక, ప్రపంచమంతటాగల ప్రజలుగూడ ఆయన త్యాగంవల్ల ఉత్సాహపరులై ఆయన ఏశాంతి సౌభ్రాతృత్వములకు చిహ్నంగాఉండెనో వానిని పెంపొందించడానికి దీక్షగాపనిచేస్తారు.

ట్రూమన్, అమెరికన్ అధ్యక్షుడు.

అత్యంతమైన ఉన్నతాదర్శములను ఆచరించి ఆయన భారతదేశానికి ప్రపంచానికి మార్గదర్శుడైనాడు. ఆయన మరణించినా, ఆయన జీవితము బోధనలు తమ ప్రభావమునుగోల్పోవు. భారతదేశంలోను ప్రపంచమంతటాను, ఆయన పవిత్రస్మృతియందు భక్తిభావంగలవారు అహింసామార్గము, సమాధానపద్ధతి అనే ఆయన ఆదర్శములను వ్యాపింపచేస్తూనే యుంటారు. ఆరెండాదర్శములతోనే ఈ యునైటెడ్ నేషన్స్ అనేసంస్థ స్థాపింపబడినది.

—లాంగెజ్ హరోవ్, యునైటెడ్ నేషన్స్ సెక్యూరిటీ కౌన్సిలు అధ్యక్షుడు.

ఈ ఋషి ఈ విధంగాచావడం ప్రపంచమునకు దురదృష్టము,

ఫారిస్ యల్ చేఖౌరి సిరియా.

గాంధీ మరణవార్త చక్రవర్తి ప్రభుత్వమునకు దిగ్భ్రమకల్గించినది. తనదేశచరిత్రలో ఇంతగొప్పపని ఇంకెవ్వరు నిర్వహించలేదు. ప్రపంచంలో అన్నిదేశాలలో పలువృత్తులకుచెందిన లక్షోపలక్షలు ఆయన మృతికి విలపిస్తారు. భారతదేశంలో మహాత్మాగాంధీ అని పిలువబడే ఆయన నేడు ప్రపంచమంతటిలో మహోన్నతవ్యక్తి; అయితే ఆయన ఏకాలంవాడో అనిపించేవాడు.

అట్లి ప్రధాని

మహాత్ముడు మానవమాత్రుడుగాడు; అతడొక మహిమాన్వితుడు. ఈయన మృతి, చాలామంచిగా ఉండడంకూడా ఎంతప్రమాదమో తెలుపుచున్నది.

—జార్జి బెర్నార్డ్ షా.

ఇది భారతదేశానికి, ప్రపంచానికి కలిగిన మహావిపత్తు.

—సర్ స్టాఫర్డ్ క్రిప్స్.

నమ్మరానిది ఊహింపరానిది జరిగిపోయింది. మనకాలంలో పరమపావనుడు, మహోత్తముడు, ఉత్తేజము కల్గించు సమర్థుడు,—అయినవ్యక్తి పిచ్చివానిఆగ్రహమునకు గురిఅయినాడంటే, విషముతాగ వలసిన సోక్రటిస్, శిలువబడిన క్రీస్తు కాలములకన్నా మనము అభివృద్ధిచెందలేదన్నమాట.

—సర్వేపల్లి రాధాకృష్ణన్.

ఈ నికృష్టమైన ఘాతవిని విహ్వలుడనైనాను.

—చర్చిల్.

గాంధీపై ఉదారుణమైన దౌర్జన్యం, దానిచే ఆయన మరణించడం విని చకితుడనైనాను. మృత్యుద్వారంలో వివాదములకు తావులేదు.

—జిన్నా.

ఇది భారతీయ చరిత్రలో దిగ్భ్రమగలిగిస్తున్న దారుణము. దుఃఖాతిశయంచేత అవశుణ్ణి : ఇప్పుడేమీ మాట్లాడలేను.

—అసఫాలీ.

ఇది మమ్ములను ముంచివేస్తున్న దుఃఖవారాసి, మహాదారుణము - ఒక్క భారతదేశానికేగాదు; ప్రపంచానికంతా.

—ఎన్. గోపాల స్వామయ్యంగారు.

ఒక హంతకుని దారుణహస్తమున భారతదేశాన్ని మానవజాతిని సేవించుట కంకితమైన జీవితము తుదముట్టడం దారుణము. కూడదీయడానికి వీలులేని ఈ నష్టమువల్ల ఒక్క భారతదేశమునకే గాక ప్రపంచానికంతా, ఏదోదరిద్రం పట్టుకున్నది.

—జఫరుల్లాఖాన్.

ప్రపంచచరిత్రలో ఒకయుగం ముగింపునకు వచ్చేసమయంలో ఈయనకు మరణం తటస్థించింది.

—అమెరీ.

"పండ్ల నందుకొనలేక మొదలునరికిన రీతిగ, భారతకల్పవృక్షము భూపతనమందెను. సాయంసంధ్యా సమయమున, వృక్షము నాశ్రయించిన, భారతీయ. శకుంత సంతానములు, మిశ్రమకుహూనినాదములలో, నశ్రుధారలగార్చుచు, మిన్నుముట్ట, రోదవెట్టుచుండెను. ఆ కొన్నవారి కమృతము, అలసినవారికినీడ, అడిగిన

ప్రపంచజ్యోతి ఆరిపోయినది.



వారికాశ్రయము ప్రసాదించి, అధోగతినున్న, భారతావని నేకైకదీక్షనుద్ధరించి గాచి రక్షించిన, మహాత్ముడు నేడులేడు. సంధ్యాసమయమునుదాటి ప్రవేశించిన, యంధకారమును విచ్ఛిన్నముజేయు మహా జ్యోతి ప్రళయపవనహతిచే నారిపోయెను. ఆ మహాత్ముడనయము నాకాశమునందొక వేగుచుక్కయై మార్గదర్శకుడగుగాక, ఆయనఆత్మశాంతికై మాయశ్రుతర్పణముల నందుగాక,

చుండూరి రత్నమ్మ

ఏసత్యాహింసలనైతే తన జీవితాదర్శాలుగా నిల్పుకొన్నాడో అత్యంతప్రాణపదంగా గౌరవించాడో ఆ సత్యాహింసలే బాపూజీ మరణానికి కారణములైనవి.

బాపూజీని బోలు అహింసావాది, సత్యధనుడు, త్యాగశీలుడు, శాంతియుతుడు ఇంతకాలంవరకు ఎక్కడా జన్మించలేదు. ఇకజన్మించబోడు. మనచేతులలోని అమూల్యరత్నంయొక్క విలువను గుర్తించలేక మనఆశాజ్యోతిని మనమే కొడిగట్టించాం. నిజంగా గాంధీజీ ఆశయాలను అనుసరించి ఆచరణలో పెట్టగలిగి నట్లయితే బాపూజీని మనం రక్షించుకోగలిగివుండేవాళ్ళం. కాని మనకటువంటి అదృష్టంలేదు. ఆ దరిద్ర నారాయణుడు, ఆ నిరాడంబరజీవి, ఆ హరిజనరక్షకుడు అతిక్లిష్టపరిస్థితుల్లో అతిభయంకరవాతావరణంలో తనసహాయం మనకు అతిముఖ్యమైనకాలంలో యావద్భారత ప్రజానీకాన్ని దుఃఖసముద్రంలోముంచి భగవంతునితో ఐక్యమైనాడు.

యద్దనపూడి జానకీదేవి

అంతరించెను ప్రాచ్యజ్యోతినేడు. ఆరిపోయెను భారతభాగ్యవిభవము. రాలిపోయెను అహింసాధర్మమూర్తి. చనిపోయినావా బాపూజీ! చరితార్థచిరంజీవి! నిజమే? దుఃఖావేశమ్మున కలమాడకున్నది. నిజమో, కలయో, నీదుమరణము గాంధీ!

యల్లాప్రగడ సుబ్బలక్ష్మమ్మ

భారతజాతిగుణాలు ఆశయాలు మూర్తీభవించిన అవతారపు పురుషుడు; మనజాతికి జన్మదాత; సత్యవాది. కర్మయోగి; మనము ప్రేమించి పూజించే బాపూజీ భారతమాతను భారతదేశ సమస్తాన్ని శోక సాగరంలోముంచి స్వర్గస్థుడైనాడు; కాదు. ఎవరికొరకై కష్టపడ్డాడో వారే దారుణహత్యకాండ జరిపి స్వర్గస్థునిగావించారు. అహింసామూర్తి హింసామార్గంలో నీచంగా హత్యగావింపబడ్డాడు. బ్రిటిష్ ప్రభుత్వం ఈ యోగిని బహువిధాలకాపాడి మనచేతులకు భద్రముగా అప్పజెప్పితే, మనంమాత్రం మనపెన్నిధానాన్ని కాపాడుకోలేకపోయాము.

బోడపాటి అలివేలమ్మ

మహాత్ముని అవతారము అందరికి అన్నివిధముల ప్రాణప్రదమైనది. హరిజనులకు ఉద్ధారకుడు, ముస్లిములకు అండ. స్త్రీలోకమునకు తండ్రి, సమస్త మానవ కోటికి ఆత్మబంధువై అలరారినాడు. భారత మహిళలు ఆయనకు చిరకృతజ్ఞతా బద్ధులు. యుగయుగాలుగా శిఖరములంటినిలిచిన ఆర్యావర్తము యొక్క

ప్రతిభ భారతస్త్రీలపై ఆధారపడి యున్నదని ఉద్ఘోషించి, జాగరితమైయున్న ఒకమహా చైతన్యజ్యోతిని ఉద్దీప్తముచేసినాడు. అధోగతి నుండి మాతృభూమిని రక్షించి కొన్ని శతాబ్దములు ముందుకు నడిపినాడు. ఆధ్యాత్మికముగా, రాజకీయముగా, సాంఘికముగా స్త్రీలను మహోన్నత పదాలలో నిలిపినాడు. భారత జాతిని మేలుకొలిపి ఆత్మోన్నతికి దారిచూపినాడు. భారత మహిళల జాగృతి ప్రపంచ నారీలోకములోనే వుత్కృష్టమైన ప్రభోధ తారగా ప్రకాశించింది. నేడుస్త్రీల కర్తవ్యమేమి? తల్లులై క్షమాశీలలై జాతిని కాపాడండి.

పొణకా కనకమ్మ, ద్రోణంరాజులక్ష్మిబాయమ్మ.

భారత భానుడు అస్తమించాడు. దేశము అంధకార బంధుర మయింది. తమ ప్రియ జనకుని పోగొట్టుకొని ఒక్క హిందూదేశమే కాదు. లోకమంతా ఆలమటించి పోతూవుంది.

తనుబిడ్డలలోనే, తన్ను మోసగించి చంపే బిడ్డలుంటారని వారు స్వప్నమందైనను తలచి యుండరు. సర్వప్రజలందును సంపూర్ణ విశ్వాసం కలిగి యున్నందుకు ఫలమిదా! ఏమి యీ అన్యాయము. ఇంకను యిటువంటి రాక్షసులు మనదేశములో వున్నారా? గాంధీజీ గుండెల్లోనే గాదు; సర్వజగత్తు హృదయం లోనే చిచ్చుపెట్టారు, ఘాతకులు.

మహాత్ముడు మరుగై పోయారుగాని, తమ దివ్యజ్యోతిని ప్రపంచ మంతటా వెదజల్లి పోయారు. అందరి హృదయంలోను ఒక నిప్పురవను వెలిగించారు. వారి వారిలోనున్న పగ, ఈర్ష్య, అహంకారము మత బేధము అనేవానిని దహించి, వారిలో అగోచరముగ నణగియున్న దైవత్వమును (మంచిశీలము)ను గుర్తించుకొని సత్యమార్గమవలంబించుటే బాపూజీ ముఖ్యాశయము.

నెమలి చంద్రమతిదేవి.

తండ్రీ, అశేష భారత దేశాన్ని దుఃఖ సముద్రంలో ముంచి నీ దారి నీవు చూచుకునే యీ స్వార్థం ఎన్నడూ లేనిది నేడు నీకెట్లాకలిగింది? భారత ప్రజలకేది దిక్కు?

శాంతమూర్తివి, జగత్కల్యాణ కారకుడవు, భారతీయుల దివ్యజ్యోతివి, భారతీయుల ఆత్మబంధుడవు, సచివుడవు, సారధివి, తల్లివి, తండ్రివి. విశ్వమానవ కల్యాణమునకై అష్టకష్టాల ననుభవించిన జగత్పితవు. నీ అడుగుజాడల ననుసరిస్తూ. నీవ ప్రియశిష్యులైన నెహ్రూ ప్రభృతులు నీవియోగ మెట్లోర్తురు?

నీసారధ్యం లేక స్వాతంత్ర్య రథం ముందుకు ఎల్లాసాగుతుంది?

చుండూరి రమాదేవి.






1883 రాజకోట హైస్కూలులో



1873 ప్రాథమిక పాఠశాలలో




1890 లండన్‌లో బారిష్టరు
చదువుతున్నపుడు.



1906 ఆఫ్రికాలో వాలంటీరుగా.



1912 దక్షిణాఫ్రికా
సత్యాగ్రహములో.



గాంధీ టోపీ—జుబ్బాతో

((శ్రీకల్చరల్ బుక్సు లిమిటెడ్, పెరంబూరు, మదరాసు వారి అనుమతితో)

# నా చిన్ననాటి ముచ్చట్లు

→ కే. యన్. కేసరి ←

## కొచ్చిరాజ్య ప్రశంస

కొచ్చిరాజ్యము కేరళదేశములో నొక స్వతంత్రరాజ్యము. ఈ రాజ్యమును చూచి ఉత్సాహింపనివారుండరు. ఈ దేశమంతయు ఉద్యానవనముగ కాన్పించును. ఇది పడమటి సముద్రతీరమున వున్నది. పడమటి కనుమలు ఈ రాజ్యమును అనుసరించి బారులుతీరి యుండును. కొచ్చిరాజ్యము గొప్పకొండలతోను అడవులతోను కూడియున్నది. భూమి చాలభాగము గుంటమిట్టలతో యుండుటవలన పంటలకు ముఖ్యముగ వర్షమేఆధారము. ఈ రాజ్యమున వర్షకాలము యేడుమాసములయినను ముఖ్యముగ జూన్ జులై మాసములు యెడతెగక రాత్రింబవలు కుంభవర్షము కురియును. ఇక్కడ వర్షాకాలము ఎండాకాలములే గాని శీతకాలములేదు. జోరున వర్షము కురియునప్పుడుకూడ వుక్కపోయుచుండును. ఈ కారణమువలన ఇక్కడివారందరు వంటినిండుగ వస్త్రములను ధరించరు. వీరు దినమునకు రెండుపర్యాయములైనను గుంటలలో స్నానమునుచేయకుండ ఉండలేరు.

కొచ్చిరాజ్యమును పాలించురాజులు హిందువులు. వీరందరు హిందువుల ఆచారముల ననుసరించి స్నానసంధ్యాది దినచర్యలను ఆచరించు ఆచారవంతులు. దేవబ్రాహ్మణ భక్తిగలవారు. నిరాడంబరముగ జీవయాత్రనుసలుపు వైదికశిఖామణులు. ఈ రాజ్యమును పరిపాలించు మహారాజుకూడ అయిదుమూరల అంగవస్త్రముతోను, మూడుమూరల పైపంచతోను రాజ్యమును పాలించుచున్నాడు. వీరు బనియను తొడుగుకొనుటకూడ ఆచారమునకు విరుద్ధమని యెంచెదరు.

ఈ రాజ్యమునేలు రాజుకుమారులకు రాజ్యాధికారములేదు. మేనల్లుండ్రకు రాజ్యాధికారముగలదు.

కొచ్చిరాజ్యమున రాజకన్యకలందరు నంబూదిరి బ్రాహ్మణులనే వివాహమాడ వలయుననే నిర్బంధమగు ఆచారముగలదు. నంబూదిరి బ్రాహ్మణులనగ కేరళదేశవాసులగు

శంకారాచార్యులవారి తెగకు చేరినవారు. నంబూదిరి బ్రాహ్మణవరునకు రాజ కన్యకలనిచ్చి వివాహముచేయునప్పుడు వరునకు రాజులు మిక్కిలి రొక్కములనిచ్చెదరు. ఈ బ్రాహ్మణభర్త భార్యయింటనే వినయవిధేయతలతో చేతులుకట్టుకొని నివసించియుండ వలయును. ఈ యిరువురకు పుట్టిన పుత్రునకే కొచ్చిరాజ్యాధికారముగలదు. వీరే రాజ్యమునకు వారసులు. ఇప్పుడు రాజ్యమునుచేయు రాజు అట్టి పుత్రులలో అగ్రజుడు. ఈ రాజుకు యిప్పుడు సుమారు 70 సం॥ ఉండును. ఈ ప్రకారముగ రాజకుమారులు వయసునుబట్టి ఒకరివెనుకఒకరు క్రమముగ రాజ్యమునుచేయుదురు. రాజ్యమునకు రాదగిన రాజకుమారులందరు యిప్పుడు సుమారు రెండువందలమంది గలరు. రాకుమారితలతో కూడ కొచ్చిసంస్థానకుటుంబము నాలుగువందలవరకును వుండును. ఇంతపెద్ద విభక్త కుటుంబము మరియెక్కడనుండదు. ఈ రాజకుటుంబములో మూడుశాఖలకుచెందినవారు గలరు. వారు రామవర్మ, రవివర్మ, కేరళవర్మ అను వంశములకు చెందినవారు.

## తిరుపునత్తొర

ఈ తిరుపునత్తొరయను చిన్నపట్టణము కొచ్చిరాజకుటుంబములోయుండు రాజ కుమారులు రాకుమారితలు నివసించుటకు ప్రత్యేకముగ నిర్మించిన రాజనగళ్లు గల స్థలము. ఈ నగరమందుండు చిన్నకొండపైన రాజ్యమునేలు మహారాజు నివసించుటకు సుందరమైనభవనము నిర్మించబడియున్నది. ఈ రాజభవనమునకు హిల్ పాలెస్ **(Hill Palace)** అనిపేరు. తక్కిన రాజకుమారులకు కుమారితలకు వేరువేరు భవన ములు నిర్మింపబడియున్నవి.

ఈ పట్టణమున గొప్పవిష్ణ్వాలయముగలదు. ఈ దేవాలయము గర్భగుడిలో ప్రవే శించి దేవుని పూజించుటకు రాజకుమారికలకు మాత్రమే స్వతంత్రమున్నదిగాని రాజులకు లేదు. ఏలననగా కేరళదేశముపై టిప్పు దండెత్తివచ్చినప్పుడు ఈ క్షేత్రమునయుండు రాజకుమారులందరు ఆడవారిని యింటవిడిచి ప్రాణభీతికి పరారి చిత్తగించరట. అప్పుడా పూరనుండు రాజకుమార్తెలకు దిక్కుదోచక ఆ విష్ణ్వాలయము ప్రవేశించి వారు ప్రాణభిక్షకు దేవునిప్రార్థించిరట. అప్పుడు టిప్పు ఆ దేవాలయమునకురాకుండ వూరువిడచి పోయెనట. ఈ కారణమున విష్ణుమూర్తి ఆడవారిని అనుగ్రహించెనట. ఈ పురాతనకథ ననుసరించిన ఆచారము ఇప్పటికిని ఈ దేవాలయమున జరుగుచున్నది.

కేరళస్త్రీలు వివాహమాడవలయునని నిర్బంధములేదు. అనేకయిండ్లలో బ్రహ్మచారిణులున్నారు. సన్యాసినులున్నారు. వేదాంతవేత్తలున్నారు. కేరళదేశవాసులు శాక్తేయులు. స్త్రీలు విభూతికుంకుమలను ధరించుకొనెదరు ఉమా, కాత్యాయిని, పార్వతి, శారద, మాధవి మొదలగుపేర్లను పెట్టుకొనెదరు. ఈదేశమున శక్తిఆలయములు మెండు. కేరళస్త్రీలు వైధవ్యచిహ్నములను అంతగ పాటించుటలేదు. పునర్వివాహము సర్వసామాన్యము. విడాకులు అమితసులభము. స్త్రీస్వాతంత్ర్యదేశమగుటవలననే దీనికి స్త్రీమళయాళమని పేరుకూడగలదు. ఈ దేశమున నంబూదిరి బ్రాహ్మణులకు మంచి పలుకుబడిగలదు.

## తిరుచూరు

తిరుచూరు కొచ్చిరాజ్యమునకుచేరిన మంచి వాసయోగ్యమైన పట్టణము. కొచ్చిరాజ్యమునకెల్ల ఈపూరి బావులజలము మంచి ఆరోగ్యమునిచ్చునవి. ఈపూర 7 మాసములు వర్షకాలమగుటచే బావులలోనీరు పైభాగమువరకు వచ్చుచుండును. నేల కంకర భూమి అగుటవలన నీరు నిర్మలముగనుండును. కేరళదేశస్తులు నీళ్లనుచూచినప్పుడెల్లను స్నానముచేయుటకు ఇష్టపడెదరు. గనుకనే వీర్లను "నీళ్లకోళ్లు" అనెదరు. ఈపూరిలో అక్కడక్కడ స్నానముచేయుటకు తటాకములుగలవు. ప్రతిదేవాలయముప్రక్కనను స్నానముచేయు కోనేళ్లుగలవు. ఇక్కడివారికి చెంబుతోనీరును నెత్తినపోసుకొను అలవాటులేదు. గుంటలలోమునిగి స్నానముచేయనిది వీర్లకు తృప్తిలేదు. ఇక్కడి ఆడవారికందరికి ఈత తెలియును. ప్రజలందరు ప్రాతఃకాలమునలేచి స్నానముచేసి దేవాలయములకుపోయి దేవుని పూజించినపిమ్మటనే వారివారి ఉద్యోగములకుపోవు ఆచారముగలదు. ఈ దేశము వారు ప్రతిదినము భోజనపదార్థములలో కొబ్బెరతురుమును కొబ్బెరనూనెను విరివిగ వాడెదరు. స్నానమునుచేయునప్పుడు వీరు వంటికి తలకు టెంకాయచమురును పట్టించుకొని స్నానమునుచేసెదరు. ఈ అలవాటువలన వీర్లకు చర్మవ్యాధులురావు. స్త్రీల శిరోజములు దీర్ఘముగపెరిగి తుమ్మెదరెక్కలవలె నల్లగ మినమినలాడుచుండును. వీరు వేడినీళ్లస్నానమెరుగరు. వీరిభోజనము సాత్వికాహారము. వీరిలో విద్యరానివారరుదు. కేరళరాజ్యమున స్త్రీలకు ఉండునంత స్వతంత్రము పురుషులకులేదు. పురుషుడు భార్యయింటికి పోవలసినదేగాని భార్య పుట్టిల్లువిడిచి మగనింటికిపోదు. పురుషులకు స్త్రీలకున్నంత స్వతంత్రము లేకుండుటవలననే వారు ఇండ్లువిడచి పరదేశములకుపోయి నౌకర్లనుసంపాదించుకొని

సుఖముగనున్నారు. విద్యాలయములలోను వైద్యాలయములలోనుకూడ శ్రేష్ఠస్థానములను ఆక్రమించుకొనియున్నారు ఈదేశమున స్త్రీవిద్యాభివృద్ధి అధికమగుటవలన పెద్దడిగ్రీలనుపొంది గొప్పనౌకర్లను చేయుచున్నారు. ఫూరిండ్లనుకూడ వీరు బహుశుభ్రముగ పెట్టుకొనను నేర్పర్లు. ఈ రాజ్యమున ప్రతిఆఫీసులోను స్త్రీలు నౌకర్లనుచేయుచున్నారు. సంపన్నుల కుటుంబములలో చాలమంది పెద్దడిగ్రీలనుతీసుకొని గృహపరిపాలనచేయుచు సుఖముగ యుంటనున్నారు. సంపన్నులయిండ్లలో స్నానమునుచేయుటకు తోటలలో తటాకములను త్రవ్వించుకొనియిష్టమువచ్చినప్పుడెల్లనుస్నానమునుచేయుచుందురు. తమయిండ్లచుట్టువివిధ ఫలవృక్షములను నాటిపెంచి వాటిఫలములను అనుభవించెదరు. అనేకరకములైన అరటి పనస ముఖ్యఫలవృక్షములు, జాజికాయచెట్లునుండును. ప్రసిద్ధములైన కొబ్బరిచెట్లుగలవు. ఇక్కడి అరటిఆకులలో పొడుగాటిమనిషి పడుకొని హాయిగ నిద్రించవచ్చును. ఈ వూరి నేంద్రంఅరటిపండ్లు చాల ప్రశస్తములయినవి. మంచిఆరోగ్యమునిచ్చు ఫలములు. మంచి ఆకలి కలిగినప్పుడు రెండుమూడుపండ్లను భుజించిన ఆకలితీరును. ఈవూరి పనసపండుతోను నేంద్రంఅరటిపండుతోను హల్వాను తయారుచేసి జాడీలలో నిల్వయుంచుకొని పండుగలకు పాయసమునుచేసి భుజంచెదరు. ఈ దేశమున శుభకార్యములకు పిండివంటలకంటె పాయసములే ముఖ్యములు. పాలుపాయసం (బియ్యం, పాలు, చక్కెర), చక్క ప్రథమన్ (పనసపండు, బెల్లం, పాయసం) నేంద్రపళం ప్రథమన్ (నేంద్రఅరటిపండు, బెల్లం, పాయసం) పచ్చపయిరు, ప్రథమన్ (పెసరపప్పు, బెల్లం, కొబ్బరతురుం పాయసం) ఈలాటివి యింకను కొన్నిపాయసములను తయారుచేసెదరు. నేంద్రఅరటికాయలతో వుప్పగాను తీపిగాను వరవలుచేసి నిల్వవుంచుకొని కాఫీతోకూడ చిరుతిండిగ నుపయోగించెదరు. బిడ్డలకు బిస్కతులకు బదులు వీటినియిచ్చెదరు.

తిరుచూరు అష్టాంగ ఆయుర్వేదవైద్యమునకు పుట్టినిలు. శాస్త్రసమ్మతమైన ఔషధ రాజములను తయారుచేయుటకు వనఓషధులు యిక్కడలభించునటుల మరియెక్కడను లభింపవు. తెల్లవారగనే పడమటికనుమలనుండి పచ్చిమూలికలను మోపులుమోపులుగ దెచ్చి విక్రయించెదరు. ఒకేతడవ సుగంధిపాలవేరు, అశోకపట్ట, బిల్వవేరు మొదలగునవి యెన్నిటన్నులు కావలసినను దొరకును. ఈ వూరినిండుగ ఓషధిద్రవ్యములను, ఔషధ ములను విక్రయించు అంగళ్లుగలవు. ఇక్కడివారు ప్రతిదినము యేదోవక తైలమును వంటికి, తలకు రాచుకొననిది స్నానమునుచేయరు. వాతవ్యాధులను కుదుర్చుకొనుటకు

పలుదేశములనుండి యిక్కడికివచ్చి చికిత్సలనుపొందెదరు. నవరక్కిళి, పిళింజలు, ధార మొదలగు ప్రత్యేక చికిత్సలనుచేయుటకు యిక్కడ సమర్థులున్నారు. ఇక్కడ సర్కారు ఆయుర్వేదవైద్యశాలయున్నది. సుప్రసిద్ధమూసు వైద్యవేత్త యిక్కడివారే. వీరు నంబూదిరి బ్రాహ్మణులు. ఈ కుటుంబమునకుచెందిన వైద్యులు అక్కడక్కడయున్నారు.

## తిరుచూరు కేసరికుటీరం

ఔషధములను తయారుచేయుటకు అన్నిఅనుకూలములు యిక్కడవున్నందున ఈ వూరిలో 15 సంవత్సరములకు మునుపు కేసరికుటీరమును స్థాపించితిని. ఈ కుటీరమును విశాలమైనతోటలో నిర్మించితిని. నివసించుటకు చలవరాళ్లు పరుప బడిన మంచి బంగళాను, ఔషధములను తయారుచేయుటకు అనుకూలమైనకట్టడమును, వనమూలికలను దెచ్చి శుభ్రపరచి సారహీనము కాకుండ భద్రపరచుటకు తగుమైన స్థలమును, ఆఫీసుకు అతిధులకు ప్రత్యేకమైన గృహములును నిర్మించబడియున్నవి. ఈ కట్టడములన్నియు విశాలమైనతోటలోయున్నవి. ఈ కర్మాగారమునకు మంచినీటివసతి కావలసియుండుట వలన మూడుబావులను త్రవ్వించి వాటికి ఎలెక్ట్రిక్ పంపుల నమర్పించితిని. నీళ్లనింపుటకు టాంకును (తొట్టి) కట్టించి నివసించుయింటికి కొళాయీలు పెట్టించి తొట్టిస్నానము, షవర్ బాత్ (Shower Bath) మొదలగువానికి సౌకర్యములను చేసితిని.

ఈ వూరిలో ఆయుర్వేద ఔషధములను తయారుచేయుటకు మంచిమూలికలు దొరుకుటయేగాక సమృద్ధిగ మంచినీరుగలదు. కట్టెలకు కరువులేదు. కూలీలు సులభముగ దొరుకుదురు. ఈ సౌకర్యములన్నియు యిక్కడయుండుటవలన వేసవికాలమంతయు నేను యిక్కడనే గడుపుచు ఔషధములను తయారుచేయించుచుందును.

ఈ వూరి ఆయుర్వేదవైద్యులు ఇంగ్లీషుడాక్టర్లవలె రోగులకు కావలసిన మందులకు జాబితా (Prescription) వ్రాసియిచ్చెదరు. గనుక రోగులే అంగళ్లకుపోయి జాబితా ప్రకారము మూలికలను దెచ్చుకొని, మందులను వారే తయారుచేసుకొని సేవించెదరు. ఈ కారణమువలన ఈ వూరివారందరును సామాన్యముగ ఔషధములను చక్కగతయారు చేయు అనుభవము గలిగియున్నారు.

తిరుచూరు మధ్యలో గొప్పశివాలయముగలదు. ఈ స్వామిపేరు వడకనాథన్. ఇది పరశురాముల ప్రతిష్ఠ. ఈఆలయములోని శివలింగము పైకికనుపడదు. ఈలింగమునకు

ప్రతిదినము నెయ్యిని అభిషేకమును చేయుటవలన పేరిననెయ్యి లింగాకారముగ సుమారు 10, 12 అడుగుల పొడవుగ కనుపించును. ఈ లింగము వేసవికాలములోకూడ కరుగక పోయినను నెయ్యిభారమువలన అప్పుడప్పుడు విరిగి కూలుచుండును. ఈ విరిగిననెయ్యి చర్మవ్యాధులకు మంచిమందని కొందరు కొనుక్కొనిపోవుదురు. ఈ దేవాలయప్రవేశ మప్పుడు చొక్కాయి ధరింపకూడదు. చేత గుడ్డ గొడుగు నుంచుకో కూడదు. బ్రాహ్మణులు, నాయర్లుమాత్రమే యిందు ప్రవేశించుటకు హక్కుగలదు.

ఈ దేవాలయములోని అర్చకులు చక్కగ చదువుకున్న నంబూదిరి బ్రాహ్మణులు. మంత్రశాస్త్రవేత్తలు. సంస్కృతపండితులు. బ్రహ్మచారులు. వీరు పొరపాటున యెప్పుడైన స్త్రీలనుచూచుట తటస్థించునేమోయని వీర్లకు ప్రత్యేకముగ దేవాలయ ఆవరణములోనే ఇంటినిగట్టించి ఇంటిచుట్టూ పెద్దప్రహరీగోడనుకట్టి అక్కడ వీరు నివసించుటకు నిర్బంధమగు యేర్పాట్లుగలవు. ఈ యింటివాకిట సిపాయికాపాకూడకలదు. వీరు నివసించు యింటినుండి దేవాలయమునకుపోవుటకు ప్రత్యేకమైన సందుదోవను యేర్పాటుచేసి వున్నారు. ఈ అర్చకులు రాత్రి 3 గంటలకు నిదురలేచి వారు నివసించు ఆవరణములోని గుంటలో స్నానమునుచేసి అనుష్టానములను తీర్చుకొని దేవతార్చనకుపోయెదరు. ఈ దేవాలయపు పూజారులలో కొందరు గొప్ప మంత్రవేత్తలున్నారు. వీర్లనుగురించి యిక్కడ గొప్పగ చెప్పుకొనెదరు.

ఈ దేవునకు ప్రతిసంవత్సరము "పూరం" అను ఉత్సవము జర్గును. ఈ ప్రాంతమున కెల్లను ఇదిగొప్పతిరునాళ్ల. ఈ ఉత్సవములో విశేషమేమన 12 గొప్ప ఏనుగులను బంగారు తొడుపులతో అలంకరించి దేవుని వూరేగించెదరు. కొచ్చిరాజ్యము గొప్ప ఏనుగులకు ప్రసిద్ధమైనస్థళము. ఈ యేనుగులు దేవాలయమునుండి బారుతీరి సోల్జర్లు **(Soldiers)** నడిచినట్లు అడుగులనువేయుచు నడుచునప్పుడు ఆదృశ్యము అద్భుతమును గలుగచేయును. ఇటువంటి వుత్సవము మరియెక్కడను వుండదు. ఈనాడురాత్రి స్వామికి బాణవేడుక జర్గును. ఈ బాణవేడుకను రెండుకక్షులవారు ఒకరికంటె ఒకరు బాగుగ చేయవలెననే యేర్పాటును చేయుదురు. ఇందుకు వీరు చాలధనమును ఖర్చుపెట్టుదురు. రాత్రి 10 గంటలుమొదలు తెల్లనారి 5 గంటలవరకు బాణవేడుకజరుగును. ఈ బాణవేడుకకు తగినమందుసామానులను తయారుచేయుటకు తిరుచూరు చాలప్రసిద్ధి చెందినది. ఈవూరు మంచికంచుపాత్రలకును గడ్డిచాపలకును పేరుపొందినది.

# నా రెండవ వివాహం

సంతానముకొఱకు మేము తీర్థయాత్రలన్నియును ముగించుకొని యిల్లుచేరితిమి. నాకు సంతానాపేక్ష అధికమగుకొలది నాభార్యకు జబ్బుకూడ అధికమై లేవలేనంత స్థితికివచ్చి మంచమెక్కెను. ఆమెకు వుపచారముచేయుటకుగాని నాకు సహాయపడుటకు గాని ఇంటిలో కూలివారుతప్ప మరియెవరును లేకపోయిరి. నా ఉద్యోగము పెద్దది. ఈ పరిస్థితులలో నేను రెండవవివాహమును చేసుకొనుటకు నిశ్చయించితినిగాని 43 సం॥ వయస్సుగలనాకు తగువయస్సువచ్చిన పెండ్లాము యెట్లులభించగలదు.

కొచ్చిరాజ్యమున కేరళస్త్రీలను బ్రాహ్మణులు వివాహమాడు సాంప్రదాయక మున్నదని తెలుసుకొని 30 సం॥ ముందు తిరుచూరులో కేరళస్త్రీని వివాహమాడితిని. అప్పుడామెకు 28 సం॥ వయసుండును. ఈమె ఈవూరిలో ఒకవకీలుకుమార్తె. విద్యావంతురాలు. ఆయుర్వేదవైద్యమునందు పరిచయముగలది. ముఖ్యముగ స్త్రీల రుగ్మతలను కనుగొని చికిత్సచేయు నిపుణురాలు. శిశుచికిత్స దెలియును. ఔషధములను చక్కగ తయారుచేయు అనుభవమునుగలది. ఓషధిజ్ఞానమున్నది. ఈమె నాయింటికి వచ్చినపిమ్మట కేసరికుటీరములో తయారుచేయు ముఖ్యఔషధములన్నియును ఈమెయే తయారుచేయుచున్నది. వైద్యశాలకు వచ్చినస్త్రీలను బిడ్డలను పరీక్షించి చికిత్స చేయుచున్నది. క్రమముగ ఆఫీసుపనులను నేర్చుకొనినది. ఇంటిపనులను మెళకువతో గమనించుచు నాకు తోడునీడ అయినది. ఇప్పుడునాకు చాలభారముతగ్గినది. ఈమె పేరు మాధవి.

ఈమె నాయింటికివచ్చిన మరుసటిసంవత్సరమున నాకు కుమార్తె పుట్టినది. కుమార్తెపేరు శారదాదేవి. ఈకుమార్తెకు యుక్తవయసురాగానే వివాహప్రయత్న మును చేయవలసివచ్చినది. తిరుచూరుకు సమీపమున సుప్రసిద్ధక్షేత్రము గురువా యూరుగలదు. ఇదివిష్ణుక్షేత్రము. మనప్రాంతమున తిరుపతికొండ వెంకటేశ్వర్లు యెంత ప్రసిద్ధియో కేరళరాజ్యమున గురువాయూరు విష్ణుమూర్తికి అంతప్రఖ్యాతి. ఈ దేశ మున ఈ దేవుని 'గురువాయూరు అప్పన్' అనెదరు. ప్రతిదినము ఈదేవుని పూజించుటకు వేలకొలది భక్తులువచ్చి పూజించి పోవుచుందురు. ఈ నారాయణక్షేత్రమున నంబూదిరీ బ్రాహ్మణ పండితోత్తములు కొందరుచేరి నారాయణజపము, భజన ఉపన్యాసములను ఇచ్చు పండితబృంద మొకటిగలదు. ఆభక్తబృందమునకు చేరిన దివాకరనంబూదిరి

బ్రాహ్మణుడుగలడు. ఈయన వేదాంతాది శాస్త్రవేత్త. భక్తుడు. భాగ్యవంతుడు. వీరి కుమారుడగు చిరంజీవి బాలకృష్ణునకు చి॥ సౌ॥ నాకుమార్తె శారదనిచ్చి వివాహమును చేసితిని. ఈ నంబూదిరి బ్రాహ్మణునిభార్య సుప్రసిద్ధ నడుంగాడి కుటుంబమునకు చేరిన కేరళస్త్రీ. నాఅల్లుడు M. B. B. S. డాక్టరు పరీక్షనిచ్చి మద్రాసు జనరల్ హాస్పటలులో యుండి పిమ్మట ఇటీవలముగిసిన రణరంగమునకువెళ్లి తిరిగివచ్చి మద్రాసులో కేసరి కుటీరమున యున్నాడు (Capt. T. M. B. Nedungadi, I. M. S.). వీరికియిప్పుడు ముగ్గురు బిడ్డలుగలరు. పెద్దకుమారునిపేరు రాధాకృష్ణుడు. రెండవకుమారునిపేరు బాలకేసరి. మూడవకుమార్తెపేరు మధుమాధవి. నాఅల్లుని యిద్దరి చెల్లెండ్రను కొచ్చిరాజు కుమారులగు రాజా కేరళవర్మ, రాజారామవర్మ రాజులకిచ్చి వివాహమును చేసిరి. ఈ యిరువురు రాజబంధువులేగాక మూడవవారగు రాజారవివర్మగారుకూడ దగ్గిర బంధువు. వీరు రాజ్యమునుచేయుటకు సమీపమునవున్నవారు. గనుక నారెండవ కల్యాణమువలన రాజబంధువులుకూడ నాకుగలరు. ఈ రాజకుమారులు సదాచార సంపన్నులు. దేవబ్రాహ్మణ భక్తిగలవారు. మద్రాసులో కొచ్చిరాజులకు కొచ్చి భవనము Cochin House ఉన్నను వీరు మద్రాసుకు వచ్చినప్పుడెల్లను నాయింటనే బసచేయుచుందురు. మేము మైసూరులో కాపురమున్నప్పుడు చాముండేశ్వరి మాకు రెండవకుమార్తెను ప్రసాదించినది. ఈమెపేరు వసంతకుమారి. నామరదలు కాత్యాయని యను ఆమె వితంతువు; బిడ్డలులేరు. నాయింటనే బిడ్డలను కనిపెట్టుకొనియున్నది. నారెండవభార్య అక్క కుమారులు నాయింటవుండి చదివినవారు. పెద్దవాడు కే. గోవింద మీనన్ ఐ. సి. యస్. (K. G. Menon, I. C.S.) వీడిప్పుడు మద్రాసుగవర్నమెంటులో లేబరుడిపార్టుమెంటు సెక్రటరిగ నున్నాడు. రెండవవాడు కుమారమీనన్ (Col. K. K. Menon I. M. S.) మద్రాసులో మిలిట్రీడిపార్టుమెంటు డాక్టరుగ పనిచేయు చున్నాడు. నాభార్యతమ్ముడు క్రిష్ణమీనన్ (K.K. Menon, B.A B L.) మధురదేవాలయములో బోర్డుతరుఫున సూపరిండెంటుగ నున్నాడు. వీడుకూడ మద్రాసులో నాయింట నుండియే చదివినవాడు. ఈ భార్యచెల్లెలికుమార్తె జానకమ్మ నాయింటనుండియే చదివి బి. ఏ. ప్యాసుచేసి కొచ్చి గానకళాశాలలో ప్రొఫసరు (Professor) గ నున్నది. నా అల్లునితమ్ముడుకూడ నాయింటనేచదివి ఇప్పుడు ప్రెసిడెన్సీ కాలేజిలో ప్రొఫసరుగా నున్నాడు. నూతన బంధుత్వమైనను ఈ ఆలి వంకవారందరు ఈ విధమున నాయందు భక్తి తాత్పర్యములుకలిగి ఈ స్థితిగా వృద్ధికి వచ్చియున్నారు.








## —: పెరుగుపచ్చళ్లు. :—

పెరుగు పచ్చళ్లను తయారు చేయుటకు గట్టిపెరుగుండిననే బాగుండును. గట్టిపెరుగు దొరకనియెడల పలుచని పెరుగును సన్నని గుడ్డలో వడియగట్టిన నీరుపోయి పెరుగు గట్టిపడును. ఈపెరుగును పచ్చళ్లకు ఉపయోగించిన బాగుండును.

## —: అల్లం పెరుగుపచ్చడి :—

కావలసిన పెరుగును తీసుకొని అందులో తగుపాటి అల్లం ముక్కలను, మిరపకాయలను (పచ్చిదైనను పరే) ఉప్పును వేసి నూరి పెరుగులో కలపవలయును. పిమ్మట జీలకర్ర ఆవాలు తిరగమాత వేయవలయును. పెరుగులో కొద్దిగ పసుపును కూడ కలిపిన బాగుండును. పచ్చిమిరపకాయలను సన్నగా తరిగి పెరుగులో కలిపి కొతిమిరాకును కూడ కలిపెదరు. ఏలననగా అల్లము కొంచము నిలువ యున్నదైనచో నూరగానే రసము బండకు పట్టి కొంతివాసన వచ్చును.

## —: అరటిపూచ (బొందె) పెరుగు పచ్చడి :—

లేత అరటిపూచను సన్నగా బిళ్లలుగాతరిగి అందుండు నారను తీసివైచి ఆబిళ్లలను సన్నగ కత్తితో ముక్కలుగ చేయవలయును. ఆముక్కలను పెరుగులోకలిపి ఉప్పువేసి ఆవాలు తిరగమాత వేయవలయును. ఈపెరుగు పచ్చడి తెల్లగనుండిననే బాగు. ఈపూచను ఎంతసన్నగ తరిగిన అంతరుచికరము. కొందరు పనస పొట్టువలె తరుగుటలో నేర్పరులు కలరు.

## —: పచ్చికొబ్బెర తురుము పెరుగుపచ్చడి :—

పచ్చికొబ్బెరను తురిమి పెరుగులో కలిపి, పచ్చిమిరపకాయలను సన్నగ తరిగిన ముక్కలను ఉప్పును కొతిమిరాకును కలిపి తిరగమాత వేయవలయును.

## —: రామములకాయ (Tomato) పెరుగుపచ్చడి :—

రామములకాయలను సన్నబద్దలుగ తరిగి పెరుగులో కలిపి, ఉప్పును, పచ్చిమిరపకాయలను వేసి కొతిమిరాకును కూడ కలిపి తిరుగుమాత వేయవలయును.

## —: మదరాసు దోసకాయ (వెల్లిరికాయ) పెరుగుపచ్చడి :—

లేతదోసకాయలను చెక్కుదీసి సన్నముక్కలుగ నరికి ఆ బద్దలలో కొద్దిగ ఉప్పునుకలిపి పదినిమిషము లుంచిన పిమ్మట ఆ బద్దలను చేతితో గట్టిగ పిండిన అందుండు నీళ్లుపోవును. అటుపిమ్మట పిండిన బద్దలను పెరుగులోకలిపి పచ్చిమిరపకాయ ముక్కలను, ఉప్పును, కొతిమెరాకును పెరుగులోకలిపి తిరుగుమాత వేయవలయును. దోసకాయను తరుగుటకంటే తురుమవచ్చును.

## —: నక్కదోసకాయ పెరుగుపచ్చడి :—

నక్కదోసకాయలను చెక్కుతీసి, సన్నముక్కలుగ తరిగి వాడ్చి పెరుగులో కలిపి కొద్దిగ ఆవపెట్టి మిరపముక్కలను, ఉప్పును కలిపి తిరుగుమాత వేయవలయును. పసుపుపొడిని చిటికెడు కలిపిన మంచిది.




18 సాలామిస్రి: ఇది యూనాని ఔషధ ద్రవ్యమైనను అందరును ఉపయోగించుచున్నారు. పరిషియా, కాబూలు, ఉత్తర హిందూస్థానములనుండి మన ప్రాంతములకు వచ్చుచున్నది. వీటిలో కొన్ని రకములుండినను పంజాసాలామిస్రి అను రకము శ్రేష్ఠము. ఇది చేతివ్రేళ్లను బోలియుండును. నరములకు బలమిచ్చుటకును, దారుఢ్యమునకును మంచి ఔషధ ద్రవ్యమని ప్రఖ్యాతి గలదు. పక్షవాతమునకు, నరముల బలహీనత వలనగలుగు యితర జబ్బులకు నాయింటి వద్దవాడితిని. గుణము యిచ్చినది. సాలామిస్రి కొమ్ములను చూర్ణించి తడవకు ఒక టేబిల్ స్పూను (Table spoon) ప్రకారము రెండు పూటలు దినముకు పాలలోకలిపి యిచ్చితినని డాక్టరుకోమర్‌గారు వారి రిపోర్టులో వ్రాసివున్నారు.

19 మిరపకాండ్ర లేక కొండ కసివిందచెట్టు ఈచెట్టు వేరుతోలు కొండజ్వరములకు **(Malarial Fever)** చాలా మంచిమందని తెలుసుకొని, ఈ వేరు తోలుతో కషాయమునుకాచి జనరల్ హాస్పిటలులో వాడగ చాలా మంచి గుణమునిచ్చినట్లు డాక్టరు కోమర్‌గారు రిపోర్టులో వ్రాసిరి.

20 అనగూదపండు: ఇది రామములక పండువలె యెఱ్ఱగనుండును. అరవములో దీనిని షవరిపళమ్ అనెదరు. ఈపండుతో తయారుచేసిన తైలమును తలకు రాచుకొనిన పార్శ్వపు తలనొప్పి పోవునని తెలుసుకొని వాడగ మంచిగుణము నిచ్చినది. చెవుపోటుకు చెవులలో రెండు మూడుబొట్లను వేసిన పోటు నెమ్మదించినట్లు కూడా డాక్టరు కోమర్‌గారి గవర్నమెంటు రిపోర్టులో వ్రాసిరి.

21 గంగరేణిచెట్టు (గంగరావిచెట్టు): ఇది ప్రతిచోటను పెరుగుచెట్టు. దీనిపూలు పసుపు రంగుతోను మెరుపురంగుతోను వుండును. ముఖ్యముగ రోడ్లప్రక్కన మునిసిపాలిటి వారు నాటింపించుదురు.

ఈచెట్టు ఆకులను మెత్తగానూరి బిడ్డల కర్వాణి అను (Eczema) చర్మవ్యాధులకు వాడగ నెమ్మతించినది. ఈ చెట్టుపట్టతో తైలమును తయారుచేసి (కొంకాయ నూనెతో) పట్టించగ మూగగజ్జి, చిడుములు మొదలగు తీటవ్యాధులు పోయినవి. ఈచెట్టు కాయలోని మృదుపదార్థమును తామర (Ringworm) వ్యాధికినూరి పట్టించగ నయమైనది. ఈమాను పట్టతో కషాయమును తయారుచేసి యివ్వగ చర్మ వ్యాధులకు మంచిపనిచేసినది. ఈచెట్టు ఆకులతోకూడ కాయలను కూడాచేర్చి మెత్తగ నూరి పట్టించగ తామర (Ringworm) కర్వాణి (Eczema) మొదలగుమొండి చర్మరోగములు నివర్తి అయినవి.

ఈ చెట్టుపట్టతోను కాయలతోను తయారుచేసి యిచ్చిన తైలమువలన మూత్ర కృచ్ఛ్రరోగము (మూత్రము ధారాళము రాకుండుట), శెగరోగము (Gonorrhoea)ఇవి కుదిరినట్లు డాక్టరు కోమర్‌గారు గవర్నమెంటు రిపోర్టులో వ్రాసిరి.

# ఇంటిపనులలో మెళుకువలు



## పిల్లల శీలము — తల్లుల బాధ్యత

శ్రీమతి సరస్వతి చెన్నకేశవన్ గారు ఎం. ఏ.



చిన్నప్పుడు పిల్లలు ఎన్నోతప్పులు చేస్తూవుంటారు. (అందులో కొన్ని ఎప్పటి కప్పటికి సమసిపోయి, ఏవిధమైన కష్టనష్టములకు కారణములుకాక మరిగిపోతాయి. కానీ, కొన్నిపొరపాట్లు ఆజన్మాంతమూ వారికష్టములకు మూలకారణము లగుచున్నాయి.

దీనికి బాధ్యులు చాల మట్టుకు తల్లి దండ్రులే. వారితాత్సారమే దీనికి కారణము. ఇటువంటి తప్పులలోకెల్ల ముఖ్యమైనది, చాల అపాయమునకు దారితీయకలది దొంగ తనము. ఈ అలవాటు బీదవారి బిడ్డలకేకాదు; గొప్పవారి యింటిపిల్లలకు కూడ అలవడడం సర్వసాధారణముగా నున్నది. ఏదోచిన్నతనపు చేష్టలనియు, వయస్సు, బుద్ధివస్తే, ఈ అలవాటు తనంతటి కదే మరిగిపోవుననియు, సాధారణముగా తల్లిదండ్రులు దీనిని తాత్సారము చేయుదురు. ఈ అశ్రద్ధవలననే పిల్లలు భావిజీవితమున చాల కష్టములకు గురియగుచున్నారు.

కనుక ఈ అలవాటును గురించి కొంతయోచించవలసిన ప్రమేయ మేర్పడు చున్నది. ఈగుణము కలుగుటకు కారణములను రెండువిధములుగా విభజింప వచ్చును. మొదటిది ఆర్థిక కారణము, రెండవది మానసిక కారణము. మొదట ఆర్థిక కారణమును గురించి కొంతవిచారింతము. మనదేశంలో దారిద్ర్యదేవత ఎల్లయెడల తాండవమాడుచున్న దనుట విశదమే. అంటే కట్టను గుడ్డలేక, తినను తిండిలేక మాడునటువంటి సంసార మున పుట్టిన పిల్లలకు దొంగతనము ఉగ్గుపాలతోనే వచ్చుచున్నది. దారిద్ర్యమునకును దొంగతనమునకును అవినాభావమున్నదని కాదు. కానీ తల్లిదండ్రులు చేయుట చూచు చున్నందువలననో, లేక వారికే, గలుగు ఆకాంక్షవలననో వారుదొంగతనమునకు లోబడు చున్నారు. తమకు లేమితనమువలన పరుల వస్తువు నపహరించుటకు మనసుపోవును. కాబట్టి, యీ ఆర్థిక దారిద్ర్యము నిర్మూలించినప్పుడే దొంగతనమునకు మూలకారణము తొలగింప బడును.

తరువాత మానసిక కారణములు కూడా ఈదొంగతనమునకు మూలకారణము లనియే చెప్పవచ్చును. దొంగతనమంటే వస్తువులను చాటున మాటున సేకరించుట

కాదు. దీనికి పునాది అబద్ధాలాడుట. ఇంట్లోనున్న పిల్లలు, పెద్దవారు అబద్ధాలాడు చున్నారని కనిపెట్టినవారు దానినే మొట్టమొదట ఆటలాటగా నేర్చుకొందురు. తరువాత దానివలన లాభములను గ్రహించి, ఎప్పుడు వారికి అనుకూలమో, ఎప్పుడు పెద్దలు దీనిని గ్రహింప జాలరు అని యోజింతురో, అప్పుడెల్ల అబద్ధాలాడుచుందురు. ఈ అలవాటే క్రమేణ దొంగతనముగా మారును. కానీ ఎంత సత్యసంధులైన తల్లిదండ్రుల పిల్లలు కూడా దొంగలుగామారుట మనము కనుచున్నాము. దీనికి కారణములున్నాయి. తన సరిపిల్లలు చేయుపనులను తాను చేయగోరుట సహజము. "పక్కింటి పిల్లవాడు, పెన్సిల్ తీసుకొన్నాడు. అందుకని వాడి పుస్తకము నేనుతీశాను" అనిపిల్లలు చెప్పడము సహజము. ఈ విధంగాకూడా దొంగతనము అలవడ గలదు. అదియుగాక తల్లులు మరీ మడిగట్టుకొని ప్రతీ దాంట్లోను సహజత్వమును గురించి నడుచుకోక, ప్రతి దానికి అడ్డాలు చెప్పుతూ వుంటే కూడా పిల్లలు దొంగతనము నేర్చుకుంటారు. పిల్లవాడు పెప్పరమింటులు కావాలంటాడు. అమ్మ "తినకూడదు, డబ్బివ్వ నంటుంది." అప్పుడు పిల్లాడు అమ్మకు తెలీకుండా పైకం తీసుకొంటాడు. అడిగితే, నాకు తెలీదంటాడు. ఇల్లాగే దొంగతనము బాగానేర్చుకుంటాడు.

కానీ దీనివల్ల వచ్చేనష్టమేమి? పెద్దవాడయి నేర్చుకొన్నాడంటే, ఇది తప్పు అని వాడికే తెలియదా? అని, అనవచ్చును. పుట్టితో పుట్టినది పుడకలతో కాని పోదన్న లోకోక్తి ప్రకారము, చిన్నప్పుడే పట్టుపడే అలవాట్లు ఎల్లప్పుడూ వుంటాయి. దొంగ తనము నేర్చిన పిల్లవాడు, రెండుజీవితములను సమంగా నడుపుచుండును. అంటే ఒకటి, తన స్వంత జీవితము; దేనిలో, తన ప్రతికర్మ గూడా సహజంగాను, న్యాయలక్షితంగాను తోచునో అది. మరియొకటి, ఈబాహ్య ప్రపంచ విధులను అనుసరించియు, పెద్దల నిర్బంధ ములకు సరియని తోచునదియు అను దొంగజీవితము. తాను దొంగయని బయిటికి కనపడనిచ్చిన, శిక్షపొంద వలసి వచ్చునని గ్రహించి, అబద్ధమాడియో, లేక యేమి యెరగ నట్లు నటించియో తప్పించుకొన చూతురు. దీని వలన వారిజీవితాంతము వరకు కొద్ది గానో, గొప్పగానో, దీనిని ప్రయోగించుటకు అలవాటు పడుదురు. ఇటువంటి బిడ్డలతల్లులకు సాటివారితో, అవమానము, మనసులోవ్యధ కట్టకడపట కలుగక మానదు.

ఇటువంటి పరిస్థితులను మాన్పుటకు మార్గము యోచించిన కారణ నాశమే కార్యనాశము అనితోచక తప్పదు. ఆర్థికంగా సామాన్య ప్రజలమైన మనము ఏమిచేయలేము. కానీ, ఇతరత్ర పిల్లలను మంచిదారిలోకి మరల్పించుట ప్రతిస్త్రీకి అందులో ప్రతితల్లికి ముఖ్యకర్తవ్యము. పిల్లలను గన్నతల్లి, తన యిష్టప్రకారము నడచుటకు స్వతంత్రురాలు

కాదు. ప్రతిచిన్న విషయములోను, ప్రతిపలుకులోను, ఆదర్శభూతురాలుగా నుండవలయును. పిల్లలను ఒకవ్యక్తిగా భావించి, వారియెడల యెంత సత్యసంధులుగాను, ఆడితప్పనివారుగాను ప్రవర్తించెదరో, పిల్లలకు దొంగతనము అంతదూర మగును. పిల్లలకు నడచుటకు, మాటలాడుటకు ఏవిధంగా పెద్దలను అనుకరించుచు నేర్చుకొనెదరో, అదేవిధముగా వారి గుణశీలము గూడా, తల్లిదండ్రుల ననుకరించియే వృద్ధిపొందును. ఎంతలేమితనమయినను, కష్టపడి జీవించుతల్లిదండ్రులు, తమదికాని వస్తువులను విషతుల్యముగా భావించుచో వారి బిడ్డలకు కూడా అదేవాడుకలు కలుగుతాయి.

తల్లి పిల్లను ప్రతినిముషము గమనించుచుండవలయును. అబద్ధములతో మొదలుపెట్టు ఈ అలవాటును మాన్పించుటకు పిల్లలకు అబద్ధాలాడుట వలన గలిగే నష్టములను కథలమూలంగానో, ఆటలమూలంగానో నచ్చజెప్ప వలయును. దొంగతనముచేసి, అనృతమాడి ఎప్పటి కప్పుడు తప్పించుకొన గలిగినను, తుదకు దానివలన తోడివారిలో అవమానము కలుగుట తెలిసికొనిరేని, ఆపనిని పిల్లలెప్పుడూ చేయరు. స్వగౌరవమును పోగొట్టుకొనుటకు పిల్లలు సహజముగ సహించరు. దానిని నిలబెట్టుకొనుటకు సరియైన మార్గము తోచని యెడల, వారు దొంగలించి యైనను, తాము సామర్థ్యవంతుల మనిపించుకొందురు. కనుక పిల్లలకు తమ నేర్పరితనము చూపుటకు సరియైన మార్గము లేర్పరిచిన, వారి మనస్సు వేరు విధముల పరుగిడదు. తల్లి పిల్లలకు ఏసమయమున ఏమికావలయునో నేర్పుతో గ్రహించి, వీలయినంతమట్టుకు తమ ఆర్థికస్థితికి తగినట్టు వారిని తృప్తిపరచుచుండిన, పిల్లలు మంచి విధులతో పెరుగుదురు. మానసిక శాస్త్రజ్ఞులు ఈవిషయములలో జనాభా లెక్కలు తీసియున్నారు. దానిలో ఆర్థిక తారతమ్యమునకును దొంగబుద్ధులున్న పిల్లలకును అట్టిసమానత్వము కనబడదములేదు. కాని, తగుశిక్షలో పెరిగిన పిల్లలు, సాధారణముగా ఈ అలవాటు కలిగి యుండుటలేదని సూచింప బడుచున్నది. తగుశిక్ష అంటే, శైశవమునుండియు క్రమ విధిగా ఆహార విహారములను జరిగించుట, అటు తరువాత బాల్యమున విధిగా, తెలివిగా వారి సమయమును వినియోగించుటకు నేర్పుటయే.

కనుకనే భావితల్లి తాను అన్నివిధముల తన పిల్లలపోషణకు జాగరూకత పడవలయును. పిల్లల మానసిక శాస్త్రతత్వములు కొంతమట్టుకైనను నేరని తల్లులు తమ పిల్లలను ఆదర్శ మార్గమున పెంచుట కష్టతరమగును. కాన ప్రతిస్త్రీ కొంత మట్టుకయిన విద్య నేర్చి, అందులోను గృహనిర్మాణమును గురించియు, పిల్లలపోషణను గురించియు విద్యనేర్వవలసినది అత్యావశ్యకము.

—A I. R. వారి అనుమతిని



# బ్రతుకుతెరువు



## చక్కెరపాకు

పలువిధములైన మధురపదార్థములను తయారుచేయుటకు చక్కెరపాకు ముఖ్యమైన వస్తువు. పాకపక్వముతెలిసిననే మైసూరుపాకు, లడ్డు, జిలేబి, రసగుల్లా, గులాబ్జాం, బర్ఫీ, ముసుకుమంత కూమిడి, ఏలకుండలు, అరిశలు మొదలగు మధురపదార్థములను చక్కగ తయారుచేయవచ్చును. గనుక చక్కెరపాకును తయారుచేయుటకు అనుభవముండవలయును. ఈపాకులోనే షరబత్తులు (Syrups), లేహ్యములు, మురబ్బాలు, జామ్ (Jams), జెల్లి (Jellies) మొదలగునవికూడ తయారుచేయుచున్నారు.

బొంబాయి, కలకత్తాదేశములలో వందలకొలది మిఠాయిదినుసులను తయారుచేసి పరదేశములకు పంపి ధనమార్జనచేయుచున్నారు.

ఈ చక్కెరపాకు పక్వమును తెలిసికొనుటకు మొదటిదిఅనుభవము. రెండవది థర్మామీటరుఅను వేడిని మాపు డిగ్రి. ఈచక్కెరపాకు నిమిషనిమిషమునకు పాకము మారుచుండును. గనుక మొదటడిగ్రి సహాయమున అనుభవమును సంపాదించుకొనుట మంచిది.

పాకుతయారుచేయుటకు కట్టెలపొయికంటె బొగ్గులపొయి శ్రేష్ఠము. పాకుపట్టుపాత్ర శుభ్రముగ నుండవలయును.

మొదట చక్కెరను నీళ్లను యెనామల్ పాత్రలోగాని శుభ్రమైన ఇత్తళిపాత్రలోగాని పోసి పొయి మీదపెట్టి చక్కెరను నీళ్లలో కరుగనీయవలయును. నీళ్లలో వేసినచక్కెర పూర్తిగ కరిగినపిమ్మటనే పాకు తెర్లుటకు ప్రారంభించును. పాకుతెర్లుకురాగానే పాత్రమీద మూతపెట్టవలయును. 5 నిమిషములపాటులో పాకుతెర్లును. పిమ్మటమూతతీసి పాత్రఅంచున కరుచుకొనియుండు చక్కెరను పాకుతోతుడిచి పాకులోనే కలుపవలయును. పాత్రమూతతీసివేసి పాకుపైభాగమున చేరియుండుమురికిని జల్లిగరిటతో పూర్తిగ తీసివేయ వలయును. పాకు శుద్ధముకాగానే థర్మామీటరును (Thermometer) ముందుగ వేడినీళ్లలోముంచియెత్తి వేడిచల్లారకముందే షరబత్తులోముంచి కావలసిన పాకమువచ్చినదాయని డిగ్రిఅంకెలను చూడవలయును. వుచేయదలచుకున్న మిఠాయికితగిన పాకమురాగానే పాత్రనుదించి క్రిందపెట్టవలయును. ఏపదార్థముకు యెన్నిడిగ్రీలు పాకుయుండవలసినది ఈ క్రిందవ్రాయబడును. పాకుకాగునప్పుడు పాత్రచుట్టు కరుచుకొని యుండు చక్కెరపలుకులను బ్రషుతోగాని, గుడ్డతోగాని అప్పుడప్పుడు తుడిచివేయుట చాలముఖ్యముగ గమనించదగువిషయము-అట్లుచేయనియెడల పాకంతయు చక్కెరగమారును. ఒకపుల్లకు సన్ననిగుడ్డచుట్టి చన్నీళ్లలోతడిపి పాత్రచుట్టు అంటుకొనియున్న చక్కెరనుతుడిచి పాత్రలో కలిపివేయవలయును.

పాకము తెర్లుటకుప్రారంభించినదానిని కలియబెట్టుటగాని కదిలించుటగాని కుదిలించుటగాని కూడదు. అట్లుచేసిన పాకము చక్కెరపలుకులగును. ఈవిషయమును జాగ్రతగ గమనించవలయును. ఏపొరపాటునగాని పాకు గడ్డకట్టకుండుటకుగాను కొంచము గ్లూకోసు (Glucose) నుగాని, సిట్రిక్ ఆసిడ్ or నిమ్మపుప్పును (Citric acid) గాని కాగుచుండు షరబత్తులో చేర్చవలయును.

పాకు పాకమునకురాగానే వుపయోగించకూడదు. మరియొకపాత్రలో చల్లనినీళ్లనుపోసి ఆపాత్రలో

వేడిపాకపాత్రను ముంచవలయును. పాకపాత్రను చన్నీళ్లలోపెట్టినప్పుడు నీళ్లు పాకములోపడకుండ చూడ వలయును. ఇట్లుపాకను చల్లార్చనియెడల పాకను క్రిందపెట్టినపిమ్మటకూడ తెర్లుచుండును. ఇందువలన పాక ముదిరిపోవును.

పాకను పరీక్షించుటకు థర్మామీటరు (Thermometer) సహాయము: పాకను బొటనవ్రేలితో తీసుకొని మరియొక వేలితోవత్తి విడదీసిన వ్రేళ్లనడుమవచ్చును.

1. చిన్నధారముపాకము—(The small thread): ఈ పాకమువచ్చుటకు థర్మామీటరుసంఖ్య 215°F చూపును. ఈ ధారము కొద్దిదూరములోనే తెగిపోవును.

2. పొడుగుధారము—(Long thread): ఈపాకము థర్మామీటరుసంఖ్యను 217°F చూపును- మొదటిదానికంటే లావుగను పొడవుగను యుండును.

3. చిన్నముత్యముల పాకము—(The small pearl): 220°F డిగ్రి వేడినిచూపును. పైమాదిరిగనే రెండు వేళ్లలో పరీక్షించిన యింకను దూరముగ దారమువచ్చును.

4. పెద్దముత్యములపాకము—(The large pearl): 222° చూపును. పైమాదిరిగనే వేళ్లతో పాకమునుతీసి రెండువేళ్లను దూరముగతీసిన చక్కెరపాక తీగతెగకుండవుండును. అప్పుడు పాకపైన ముత్యములవలె (Bubbles) కనబడును.

5. చిన్నబుగ్గ—(The samll Blow or Soffle) పాకము: ఈపాకమును డిగ్రి 230° చూపును— ఒక వరిగడ్డిపోచనుతుంచి ఒకభాగమును చక్కెరలోముంచి మరియొకభాగమును నోటిలోపెట్టుకొని వూదిన అడుగుభాగమున బుగ్గ (Bubble) వచ్చును.

6. పెద్దబుగ్గపాకము-(The large Blow or Feather): ఈపాకమునకు 232° చూపును. పైమాదిరిగనే పరీక్షించిన (Bubble) పెద్దదిగ వచ్చును. ఊదినదూదివలె పైకెగసిపోవును.

7. చిన్నవుండ లేక మెత్తటివుండపాకము. (The small or soft ball): ఈ పాకమునకు డిగ్రి 236° మొదలు 240° వరకు చూపును. ఈపాకమును కొద్దిగతీసుకొని చన్నీళ్లలోవేసి రెండునిమిషములకు పిదప పాకనుతీసి రెండువేళ్లలో వుండచేసిన మృదువుగ వుండయగును.

8. పెద్ద లేక గట్టివుండపాకము (The large or hard ball): ఈపాకమునకు డిగ్రి 247° మొదలు 252° వరకుచూపును. పైమాదిరిగనే పరీక్షించిన వుండ పెద్దదిగను గట్టిగను వుండును.

9. చిన్నపగులుపాకము (The small crack): ఈ పాకమునకు డిగ్రి 290° వేడినిచూపును. ఈ పాకమును కొద్దిగ చల్లనీటిలోవేసి తీసి వేళ్లతోవత్తిన పగులును. పండ్లతోకొరికిన బంకమాదిరిగ సాగును.

10. పెద్దపగులు పాకము (The large crack): ఈపాకమునకు పాక 312° డిగ్రి వేడినిచూపును. పైమాదిరిగనే దీనిని పరీక్షించిన పాకకడ్డిపెళుసుగ విరుగును. దీనిని కొరికినను పెళ్లుమని విఱుగును.

11. లక్క పాకము (Caramel): ఈపాకమునకు పాక 350° డిగ్రి వేడినిచూపును. ఇప్పుడు పాక కాఫీరంగుగ (Brown) మారుటకు ప్రారంభించును. ఈరంగు రాకుండ జాగ్రతగ చూడవలెను. లేకుండిన పాకపక్వము ముదిరి మండిపోవును. మరుసటి మాసములో డిగ్రి (Thermometer) లేకుండగనే పాక పట్టువిధము వ్రాయబడును.

# సోమపాట (ద్విపద)

వంగోలు వెంకటరంగయ్యపంతులుగారు. బి.ఏ., బి.యల్.

(సేకరించి పంపినది.)

ఈ యజ్ఞవేదిక[1] యీయజ్ఞశాల[2]
ఈయజ్ఞ మీచెల్వ[3] కెంత యొప్పినదో!

శ్రీగణనాయకు జిత్తమున నిలిపి
శ్రీగురు శ్రీనివాసస్వామిని దలతు.

సరసులెల్లను మతి సంతసించుటకు
సరసయజ్ఞము పాట సరళిఁ బాడెదను.

సారమెంతయు లేని సంసారఘోర
వారాశి దాటుటకు వాడ[4] యజ్ఞంబు.

తపము[5] గాదె తొల్లి తమ్మి చూలికిని
నెపమాయె నీజగ న్నిర్మాణమునకు.

మువ్వర్ణములవారు[6] మునుపు సేయుదురు
ఇవ్వేద గ్రంథోక్త నిజకర్మములను.

వీరి కందఱికెల్ల విహితకర్మయును
వేరులేదని యిట విహితమైయుండు.

అవని సురులకును యారుకర్మములు[7]
అవి కావు యజనాదు[8] లని బుధులండ్రు.

చిత్తముశోధించి సిద్ధించు[9] టకును
సత్త్వైన యాగమె సకల నిశ్చయము.

ముగ్గురు తనకైన మునుపటివారు
జగ్గున జన్నంబు సేయకుండినను

సాంబ్రాజ్య[10] మెంతయు సమకూడి యున్న
దుర్బ్రాహ్మణుం[11] డని దోషమెన్నుదురు.

సర్వజ్ఞులైనట్టి సంయములకును
ఉర్విలో యాగములు యొప్పుగావెలసె.

అన్నదానము లేక యాహుతి లేక
పన్నుగా దక్షిణల్ పరగీయ లేక
మంత్రతంత్రములచే మన్నన లేక
తంత్రమీయజ్ఞంబు దనుజంపుట[12]కును.



ఈ మహాశమునులెల్ల యొప్పగావినగ
సోమయాగ[13] సమృద్ధ సొంపువర్ణింతు.
శేషాచలోత్తర దేశంబునందు
నిశ్శేషసుగుణాలనిలయమై యొప్పు
ఇట్లట్లు వర్ణింప నెవ్వరివశము
మట్ల వెంకటరామ మహిపతి[14] సోము.
అక్కడ సిరి కాట పట్టైన నెలవు
చక్కని కిచమాంబపుర[15] మొండుగలదు.
దక్షిణ బాహుదానదుల తీరమున

* * *

మార్గమైస్వర్గాప వర్గములకును
అందగగాములై యందులగలరు
ఇందుశేఖరులని యెన్నిక కెక్క

* * *

ప్రశమంబుతోవారు పాలింపుచుండ్రు
దశమియేకాదశీ ద్వాదశీ వ్రతము[16].
ధ్యానావధానులై దృఢచిత్తమునను
పూని శ్రీహరిపూజలను సల్పుచుండ్రు.
మసలకెప్పుడు వేదమంత్రఘోషములు
వసుమతీసురులిండ్ల వెలయుచునుండు.
ఎల్లకాలంబుల నిష్టి[17] పశువులు[18]
కొల్లగ సోమయాగములును నుండు.
వారువ్రేల్చెడి యజ్ఞవిభవమంతయును
వివరించి పల్కెద వినుడు వేడుకల.

---

1 యజ్ఞవేదిక—యజ్ఞాదులుచేయుటకై కొలదిఎత్తుగలిగి చదరముచేయబడినప్రదేశము. ఈ క్రిందచూపబడినప్రకారము ఆకృతుల నేర్పరచి వానియందు త్రేతాగ్నుల నుంచుదురు. మధ్యనుండు విడిచోట యజ్ఞపరికరములు (అనగస్రుక్స్రువాదులు) దర్భలు పెట్టుకొందురు.




2 యజ్ఞశాల—యజ్ఞముచేయుటకై వేయబడుశాల. దీనినే ప్రాగ్వంశము లేక ప్రాచీనవంశమందురు. పైనజూపిన యజ్ఞవేది ఈ శాలయందుండును. సోమదేవియు (యజ్ఞదీక్షితునిపత్ని) ఈ శాలలోకూర్చుండియుండును. ఈ శాలప్రాముఖ్యముగ వెదురుబొంగులతో నిర్మింపబడును. ఈ బొంగులు మొదళ్లు పడమటిదిక్కునను అగ్రములు తూర్పుతట్టునను వ్యాపించియుండును. అందుచేతనే దీనికి ప్రాగ్వంశమనిపేరు యేర్పడినటులున్నది.

ప్రాగ్వంశవివరణము—నాలుగుదిక్కులనుంచి బాగుగవెలుతురు వచ్చునదిగనుండవలయును. మిగిలిన భాగమునకంటెదక్షిణభాగము ఎక్కువదిట్టముగ నుండవలయును. నాలుగుదిక్కులందును నాలుగువాకిండ్లుకలిగి యుండవలయును. ఒక్కొక వాకిలియు అరత్నిప్రమాణము వెడల్పు కలిగియుండవలయును. అరత్నియనగ మోచేతిమొదటినుంచి చిటికెనవ్రేలికొనవరకుగలపొడవు. ఈశాన్యమూలనుండి నైఋతిమూలకు ఆగ్నేయము నుండి వాయవ్యమునకు పదియారు ప్రక్రమములపొడవు కలిగియుండవలయును. ప్రక్రమమనగ ఒకఅంగ ఎడ మగును. పండ్రెండు అంగల విస్తీర్ణముగలిగి దీర్ఘచతురస్రముగ నుండవలయును. దీర్ఘచతురస్రమనగ ఇంగిలీషున ఆబ్లాంగుఅగును. (శ్రౌతపదార్థనిర్వచనము) యజ్ఞార్థము ఎంతెంతభూమి శ్రుతిప్రమాణముగ కొలతలుచేయబడి యేర్పరుపబడుచున్నదియో అట్టిభూమికి విహారముఅని పేరు.

3 చెలి—ఈ సోమపాటచెప్పినది ఒక స్త్రీ. ఆమెతనసఖులతో సల్లాపము చేయుచుండినట్లు ఈపాటలోకొన్నిచోట్లకనుబడును. ఇచట "చెలి"యని పలుకబడిన స్త్రీ యజ్ఞదీక్షితునిపత్ని. చనువున "చెలి"యని ప్రయోగించినటులున్నది.

4 ఈ పాదమున పాదాద్యక్షరమగు "వా"కు యతిస్థానము కుదురుటకుగాను "ఓడ" యనుపదము "వాడ"యని ప్రయోగింపబడినటులున్నది. మఱియు ముండకోపనిషత్తునందలి 1.2.7 నందు యజ్ఞములు ప్లవముల (ఓడలు.పడవలు)తో పోల్చబడియున్నవి. 'ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపాః' ఇత్యాది మఱియు శ్రీమద్భాగవతమున 10 (పూర్వభాగము) 25.4 లో 'యథాఽదృఢైః క్రతుభిర్నామనౌనిభైః' ఇత్యాది యున్నది. ఉదాహృతవాక్యములరెంటను యజ్ఞములకు ప్లవసామ్యమున్నదిగాని అదృఢమైన ప్లవములట (ఓటిపడవలు)!

5 సతపోతప్యత - సతపస్తప్త్వాఇదగ్ం సర్వమసృజత్ (ఆనందవల్లి 6) (ii) కమలభవుండు దాఁదపము కల్మిన కాదెసృజించె నెల్లలోకముల (శాంతిపర్వము 5-498)

6 బ్రహ్మక్షత్రియ వైశ్యులకు స్మృతులయందు యజనాధికారముచెప్పబడినను వైశ్యులు యజ్ఞముల జేసినవిషయము సకృత్తుగ గన్పడుచున్నది. మహాభారతకర్ణపర్వాంతర్గత హంసకాకీయోపాఖ్యానమున నొక యుదాహరణ మగపడుచున్నది:—

వైశ్యః కిలసముద్రాన్తే ప్రభూత ధన ధాన్యవాన్ ।
యజ్వాదానపతిః క్షాంత స్స కర్మస్థోఽభవచ్ఛుచిః ॥

మనకాలమున శ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహశ్రేష్ఠిగారు వేదోక్తముగ నగ్నిష్టోమ యాగము సలిపి శ్రీ లక్ష్మీనరసింహ సోమయాజులని ప్రఖ్యాతులైయుండిరి.

7 సంధ్యాస్నానం జపో హోమో దేవతానాంచ పూజనం।
ఆతిథ్యం వైశ్వదేవంచ షట్కర్మాణి దినేదినే ॥ (పరాశరస్మృతి)

8 యజన యాజనాధ్యయనాధ్యాపన దానప్రతిగ్రహములు.

9 (i) యజ్ఞోదానంతపశ్చైవ పావనాని మనీషిణాం (భగవద్గీత)

(ii) అహంనియమ మాతిష్ఠే సిద్ధ్యర్థం పురుషర్షభ (రామాయణం బాల 19-4)
నియమం = యజ్ఞదీక్షాం అని గోవిందరాజవ్యాఖ్య.

10 (a) సాంబ్రాజ్యశబ్దము సాధువుకాదు; సామ్రాజ్యమని యుండవలయునుగదా.

10 (b) క్రింది పాదములోని దుర్బ్రాహ్మణ శబ్దములోని "బ్రా" కు ప్రాసకొరకు సాంబ్రాజ్యమని కవయిత్రి ప్రయోగించియుండునా?

11 దుర్బ్రాహ్మణుడు — య ఆత్రృతీయాత్ పురుషాత్ సోమంనపిబేత్
విచ్ఛిన్నోవా ఏతస్య సోమపీథో దుర్బ్రాహ్మణః
ఎవనికి త్రిపురుష పర్యంతం యాగవేదాధ్యయనములును అగ్న్యాధానములుంగ లేవో అట్టివాడు దుర్బ్రాహ్మణుడు.
(కృష్ణయజుర్వేద 2.2)
యస్య వేదశ్చ వేదీచ విచ్ఛిద్యేతే త్రిపూరుషం
సవై దుర్బ్రాహ్మణోజ్ఞేయ: సర్వకర్మ బహిష్కృతః॥ బోధాయనస్మృతి
దౌర్బ్రాహ్మణ్య నివృత్తికొరకు ఆశ్విన పశువు.

12 యజ్ఞస్య వితతస్య నక్రియతే తదనుయజ్ఞః పరాభవతి యజ్ఞం పరాభవంతం యజమానో.........
[తై. సం॥ 6-1-5

నిహతస్యచయజ్ఞస్య సద్యః కర్తావినశ్యతి (రామాయణము-బాల 8-17,
దీయతాందీయతా మన్నం (డిటోడిటో 14-12)

13 సోమరసము ఈ యాగమునకు ముఖ్యద్రవ్యము.

14 మట్లవారు కడపజిల్లాలోని రాచవీడు (రాయచోటి) పుల్లంపేట (రాజంపేట) సిద్ధవటము. బద్వేలి ప్రాంతముల రాజ్యముచేసినట్లు కడపజిల్లామాన్యుయల్ వలనను శాసనములవలనను తెలియుచున్నది. ఈ వంశమువారు క్షత్రియులు. ఈ వంశమున క్రీ-శ 1608 ప్రాంతముల వెంకటరామరాజుఅను ప్రభువుండెను. పదునెనిమిదవ శతాబ్దమధ్యకాలముననింకొక వెంకటరామరాజుండెను. ఇచట ప్రస్తావింపబడిన వారియిద్దరిలో నెవరో నిర్ణయింపనలవికాదు.

15 ఇది కడపజిల్లా రాజంపేటతాలూకాలో బాహుదా (చెయ్యేరు) నదియొడ్డుననుండు అగ్రహారము, దీనికిపుడు అత్తిరాల అని పేరని తెలియుచున్నది.

16 ఏకాదశీవ్రతము మూడుదినముల దీక్షగనున్నది. దశమినాడు ఏకవారాశనము ఏకాదశినిరశనము ద్వాదశి ఏకవారాశనము. ఈ వ్రతమును శైవులును వైష్ణవులును ఆచరింపవచ్చునని నిర్ణయసింధువులోనున్నది.

17 యజ్ఞాంగములుంగ నడుమనడుమ చేయబడుక్రియలు. ప్రాయణీయేష్టి - ఆతిథ్యేష్టి-అవభృథేష్టి ఇత్యాదుల నేకములు.

18 పశువులు = యజ్ఞపశువులు-భాగము (మేకపోతులోనగునవి.) (సశేషము)

— ••••• —

## గమనించండి.

మేము ప్రచురింప జాలని రచనలు రచయితలకు తిరిగి పంపబడవు. కాబట్టి వృథాగా పోస్టుబిళ్లలు పంపకండి. నకళ్లు వ్రాసి ఉంచుకుని అసలు రచనలంపితే ఉభయత్రా సౌకర్యం.

సంపాదకుడు.

# గృహలక్ష్మికి పద్యరత్నములు

తల్లికిఁదోడై, పనులను
యుల్లమలరఁజేయవలయు నోపికతోడన్
చెల్లెండ్రఁదమ్ముఁ గుఱ్ఱల
సల్లలితపుమమతఁగనుము జయగృహలక్ష్మి !

అన్నల కక్కల కెప్పుడుఁ
జిన్నియనుఁగుఁజెల్లెలగుచుఁ జిడిముడినడకన్
మన్నింప నేర్చువారికిఁ
గన్నాకుగ మెలగవలయుఁగా గృహలక్ష్మి!

జననీ జనకులు మెచ్చిన
ఘనముగ సత్కీర్తిఁబొందఁ గల్గెదవమ్మా!
వినయము శ్రద్ధాభక్తుల
ననయము నేర్వంగ మంచిదౌ; గృహలక్ష్మి!

బడికేగి, సకాలంబునఁ
గడుమక్కువతోడ గురులు గఱపెడి చదువుల్
విడువకఁ బఠియించిన, నల
వడదే విజ్ఞానకాంతి వరగృహలక్ష్మి !

చదువేల బాలికలకని
మదిలో భావింపకమ్మ! మమతతో విద్యల్
కుదురుగనేర్చిన మెచ్చదె
ముదమున లోకంబు? తెలియవో? గృహలక్ష్మి

విద్యయె భూషణరాజము
విద్యకు సరిబోలునట్టి విత్తము గలదా?
ఉద్యోగ వాంఛ నడచియు
విద్యను నేర్వంగ మేలు; విను గృహలక్ష్మి !

కల్లూరు అహోబలరావు,

# నేటి సినీమా కళ

శ్రీ మద్దూరి వేంకటసుబ్బారావుగారు

ప్రపంచము నంతటిని నావరించి, రాజకీయ మత సాంఘికస్థానము లన్నిటిలో రూపొందుచు, దిన దినాభివృద్ధిగాంచుచున్నవి నేటికాలపు చలన చిత్రములు. కళయొక్క ముఖ్యోద్దేశము ఆనంద మిచ్చుటయే. మానవులలోని అలసత్వము, మానసిక దౌర్బల్యము మొదలగువానిని తాత్కాలికముగా నైనను అణచి ఆహ్లాద పరిపూర్ణులుగా చేయు చుండుటచే, చిత్రజగత్తు కళాస్థానము నాక్రమించు ననుటలో అతిశయోక్తి లేదు. అట్లయిన నెంతవఱకు దీనినిగూడ నితరకళలతో సమాన ప్రతిపత్తిలో నుంచవచ్చును అనునది విచారించ వలసియున్నది. దానిని గుర్తెరుగుటకు స్వభావపరిశీలనమే మనకర్త వ్యాంశము.

ఆనందమే పరమావధిగా కళ నెంచినచో! చిత్రజగత్తు తనకర్తవ్యము నెఱవేర్చుచున్నదనుటలో సంశయ మిసుమంతయు లేదు. ఆధునిక సంస్కృతిలో ప్రధానస్థానము వహించుచున్నది. పగలెల్ల శ్రమపడి అలసటనొందినవానికిని, దుఃఖభాజనమగు జీవితముతో క్లేశముల ననుభవించు వానికిని, క్షణమాత్రమయి నను, ఆహ్లాదమిచ్చి వారిపూర్వపు సంగతులను మఱపునకు దెప్పించుచున్నది. క్లిష్ట సమస్యలన్నిటిని బహు సులభముగా చలనచిత్రములద్వారా ప్రజలకుబోధింపవచ్చును. సంఘములోని మూఢాచార, మూఢవిశ్వాసములను, చెడుగును బయటపెట్టి మానవులను విజ్ఞానవంతులుగాజేసి వారిని ప్రకృతిలోని మాధుర్యమును గ్రహించునట్లు జేయుచున్నది. సారస్వతము ప్రధానాశయము ఆనందము ప్రచారమున్ను; చిత్రజగత్తు ముఖ్యోద్దేశములుగూడ నివియే. ముఖ్యముగా ప్రచారములోనివి నెక్కువగా నుపకరించును. కఱువులు; వరదలువచ్చి దేశమును పాడుచేసినప్పుడు, వాని ఫలితము ననుభవించని వారియందు కరుణపుట్టించి, సహాయముద్వారా పీడితప్రజల నానందపరిపూర్ణులుగా చేయగలదు. పంటలనెక్కువగా పండించువిధానమును ఆరోగ్యశాఖవారి రక్షణవిధులను చిత్రజగత్తుద్వారా ప్రజలకు సుబోధకమగునట్లుచేసి, ప్రజలకు ఆరోగ్యముచేకూర్చి, సంతోషవంతులుగా జేయగలదు. మానవులు శక్తిలోపముచేతను, ధనహీనతచేతను తాజ్ మహల్ వంటి కాంచలేని దృశ్యములను, తెలిసికొనలేని విషయములనుచూపి ఆనంద మిచ్చుచున్నది. ఇంకను ప్రధానమైనది, ధనికవర్గమువారిచేనిర్మింపబడిన ఆర్థికవిధానము మూలమునను యుద్భవించిన నిరుద్యోగ సమస్యను చిత్రజగత్తు కొంతవఱకు పరిష్కరించి వారిని ఆహ్లాదపఱచుచున్నది. ఎక్కడెక్కడో భూగర్భములలోదాచబడిన మూలధనమును వెళ్లగింపజేసి దానినివెచ్చింపజేసి (investment) నిరుద్యోగసమస్యా పీడితులకు మార్గము చూపించుచున్నది. యంత్రముల నిర్మాణముకొరకును, స్టుడియో నిర్మాణములోను చలనచిత్ర ప్రదర్శనశాల నిర్మాణములకును. వానినడుపుటకును, పాత్రలకుగాను, ఏదియోరీతిని దారిచూపించుచున్నది.

ఇన్ని కార్యములుచేయుచు ఇట్లు ఆనందము నిచ్చుచుండుటచే నిదియొక కళఅని చెప్పకతప్పదు. కాని పైనచెప్పినదంతయు దాని బాహ్యస్వరూపము. సూక్ష్మదర్శినీ యంత్రముచే ప్రతి వస్తువుయొక్క అంతర్గతము తెలిసికొని ఆవస్తువు రమణీయతను గ్రహించినట్లు, వీటి అంతరంగిక స్వరూపము వీటి కళాస్థానమును మనకు విశదపఱచును.

పరిశీలనాదృష్టితో చూచిన ఇవన్నియు నివురుగప్పిన నిప్పువలె గోచరించును. పైనజెప్పిన విషయముల మనముననిడుకొని చిత్రములు ఎవరును దీయుటలేదు.

ధనాశ విపరీతమై, కేవలధనసంపాదన కర్తవ్యముగ
నెంచి నేటి చిత్రజగత్తులు నిర్మింపబడుచున్నవి.
చిత్రములలో పతివ్రతల వేషము వేసి నీతులుబోధిం
చెడివారి విషయము, త్రాగుడుమానమని చెప్పెడి
మనుజుల నిజముగుస్వభావము నికచెప్ప నవసరమేలేదు.
చిత్రనిర్మాణ ప్రాంగణమంతయు కేవల స్వార్థపరత,
ధనవాంఛ, అవినీతిమయము. చిత్రములలోనుంచి
నీతులుబోధించుట మంచిదే. కాని అవిపాటించి
బోధించినచో వాటియందు రమణీయతయుండును.
అట్లుకానిచో అవి శ్రీరంగనీతులును, మెట్ట వేదాం
తములునుఅగును. చిత్రములలోగూడ పైనచెప్పబడిన
మంచి విషయములుండుటలేదు. స్త్రీలను అర్ధనగ్న
ముగా చిత్రములందీయుట, చెడ్డకథలను మొదలగు
వానిని తెరమీద ప్రవేశపెట్టి లోకమును ఆర్థికముగా
సాంఘికముగాగూడా చెఱచుచున్నారు. పెట్టుబడి
దారు, పాత్రధారి, దర్శకుడు, కవి వేరువేరుగా
నుండుటచే చిత్రజగత్తులో మనస్పర్థలేర్పడి, పెట్టుబడి
దారు యిష్టప్రకారము దర్శకుడును, దర్శకునిష్టరీతిని
కవియును, తమ స్వాతంత్ర్యమును తొలగించు
కొనుచు చిత్రకళాభివృద్ధిని ఆటంకపఱచుచున్నారు.
కవి తనకవిత్వమును కేవల ధనార్జనోపాయనిమిత్తమై
చిత్రజగత్తుకు కవిత్వముచ్రాయుచు, చిత్రనిర్మాణము
పూర్తియగువఱకు, చిత్రనిర్మాణ ప్రాంగణములోనే
నివసించుచు, సారస్వతసేవ మఱియొకరీతిని చేయుటకు
కాలముదొఱకక అగచాట్లుపడుచు, చివఱకు సార
స్వతమునకుగూడ ద్రోహము చేయుచున్నాడు. చారి
త్రాత్మకముగా నిర్ధారణచేయబడిన విషయమునకును
హస్తిమశకాంతరము భేదముండుచున్నది. చిత్ర
నిర్మాణ ప్రాంగణమంతయు, అవినీతి మయమగుటచే,
సత్ప్రవర్తనకలవారికి అందులోప్రవేశింప నర్హతయే
లేదు. చిత్రనిర్మాణములో ఎవరును విద్యావంతు
లుండుటలేదు. వారికి విషయములు తెలియవు. కవి
చెప్పినను వినరు. ఏగోజునెంత చిత్రముఁదీయగలమో
అని ఆలోచనలేకయే, అన్నిపాత్రలను రప్పించి-
వారికి వేషములువేసి, వారి ఫలహార భోజనపదు
పాయములకు బాగుగా వెచ్చించి, చివఱకు వారివం
దతిని అగోజున తీయుటకువీలులేక, వారిని వారి
గృహములకు తిరిగిపంపుచు కాలవ్యయమును, ధనవ్యయ
మునుగూడ అపరిమితముగాజేసి దేశమునకు తీరని
నష్టమును గావించుచున్నారు. చివఱకు అందఱకు
ఒళ్లు, కళ్లు, ధనము గుల్లతప్ప మరింకేమియుండబోదు.
లాభములు అధికముగావచ్చినను, పైదుర్వ్యసనములచే
నెక్కువ అవకాశమును ధనము సంపాదించుటయందు
గ్రహించలేక పోతున్నారు. ఒక ఆదర్శముపెట్టుకొని
కళకొరకు పాటుబడుట అణుమాత్రమైన యుండుట
లేదు. ఏరీతిని చిత్రముఁదీసిన ధనమమిక్కుటముగా
సాదింపవచ్చునో అవిమాచి, అవిఎంత అవినీతికర
మైనను, వానిని తీయుటయందు పట్టుదల చూపుచు
న్నారు. కళకొఱకు పాటుపడుచుంటిమని చెప్పెడి
వారల సంగతులన్నియు సత్యదూరము. వారిపాట్లు
ధనముకొఱకుగాని, కళకొఱకుగాదు.

ఇది నేటి చలనచిత్రములయొక్క అంతర్గత
స్వరూపము. ఆదర్శముతో రమణీయతను పెంపొం
దింపజూచి ఆనందమియుటయే కళ. నేటి సినిమాకళ
లో ఇదిలోపించుటచే అది నిజమైన కళ గానేరదు.

కుల స్త్రీలనుగూడ సినీమాలలో జేరమని
నుడువుచున్నారు. ఇదియింకను సంఘమునకంతటికిని
అపకారమొనర్చును. సినిమాకళ కళావంతమగుటకు,
విద్యాభివృద్ధి కావలయును. దర్శకుడు మంచివిద్యా
వంతుడు గానిచో కళ శోభింపనేరదు. పెట్టుబడి
దారి, కవి, దర్శకుడు, పాత్రధారి ఒకడేయైనచో
సినిమాకళ నిజముగారాణించును. చివఱకు దర్శకుడు,
కవి ఒకడేయైనచో చిత్రజగత్తునకు కలిగేమేలు యిం
తింతయనరాదు. సినిమాకళ బాగుపడుటకొఱకు
మనుజులలో విద్యావ్యాప్తి జఱిగి, సత్ప్రవర్తకులగు

వఱకును, పురుషులే నాటకములలోవలె స్త్రీపాత్రలను ధరించుటముఖ్యము. లేక మహిళాసంఘములే చిత్రనిర్మాణమునకు కడంగి అందరిస్త్రీలు పురుషపాత్రలను ధరించుచు చిత్రములు దీయవలయును. మద్రాసులోని బాలసంఘముయొక్క అభినయములు చూచినవారందరు మెచ్చుకొనకమానరు. అటువంటి సంఘములనుస్థాపించి, వారివారి అభినయములను చిత్రములందీయుట చాలమంచిది. అవన్నియు చూపరులకు ముద్దుగొల్పుచుండును. చిత్రజగత్తుయు రాణించును. ప్రతివారునుఒకదానిని ఆదర్శముగానుంచుకొని చిత్రములుదీయ సమకట్టితీరవలయును. ఇట్లుగానిచో చిత్రకళ శోభింపనేరదు.

తుకారాం, పోతన, త్యాగయ్య వంటి చిత్రములు భక్తిభావము పెంపొందింపవచ్చును; రామశాస్త్రివంటి చిత్రములు పట్టుదలను, దృఢనిశ్చయమును అభివృద్ధిచేయవచ్చును; రైతుబిడ్డవంటి చిత్రములు సంఘములోని దురాచారములను ప్రెల్లగింప, జూడవచ్చునుగాని తెఱవెనుకగల అపవిత్రతచే వాటిపనులు అవి చేయజాలకపోవుచున్నవి. సత్యము ఆదర్శము ఈరెండును లేకపోవుటచే చిత్రకళ తన నామధేయమును సార్థకమొనరించుకొనుటలేదు.

ప్రకృతి సౌందర్య ప్రతిబింబమే కళయొక్క ఆశయము. ప్రకృతిని, సత్యము సమీపమునకుతెచ్చి చిత్రించినపుడే కళాఉత్కృష్టత వెల్లడియగును. అంతియకాని హేయమైన జీవితముపైన పవిత్రతాస్తంభముంచుట కళగాదు. అదికల్ల లేక కలయగును. ఈకారణముచేతనే చిత్రజగత్తు ఇతర కళలతో సమాన ప్రాతినిధ్యము వహించుటకర్హముగాక పోవుచున్నది. నిజముగా ఇటువంటివిషయములు చాల శోచనీయమైనవి. కాన బాహ్య స్వరూపమునకును, సామరస్యము పెంపొందించి, ప్రకృతి సౌందర్యమును దాని నిజాకృతితో ప్రతిబింబింప జేసినచో అప్పుడు చిత్రజగత్తుయొక్క కార్యము నిజమైన కళోపాసనయని యనిపించుకొనును. ధనవిషయమును గూర్చిన తలంపు నిజమైనకళయందు ప్రభావము చూపించగూడదు. అట్లుండిన దానిని ధనసంపాదన కళ (art of making money) యందురుగాని, చిత్రకళయని ఎవరును అన సాహసింపఁజాలరు.

# పసుపులేటి రంగాజమ్మ



ప్రసిద్ధాంధ్ర దాక్షిణాత్య కవయిత్రి
(క్రీ॥ శ॥ 1650 ప్రాంతము)



శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ఎమ్.ఎ.



(గత సంచిక తరువాయి)

మన్నారుదాసవిలాసనాటకమున నీమె ప్రతిభ లోకజ్ఞత - హాస్యరససంవిధానము - సంగీతపరిజ్ఞానము నిండారవెల్లివిరియుచున్నది. ఈ నాటకమునందు పాత్రోచితభాష వాడబడుటచే నిది మఱియు రసవత్తరమై, హాస్యమన నిదియని నిరూపించుచున్నది. కొన్నియుదాహరణములు.

ముహూర్తము నిర్ణయించుటకు రాజుగారియాస్థానముననున్న గణితజ్ఞుల చర్చలు-ఒకరిపైనొకరివాక్యములు-సంభాషణ

భైరవజ్యోస్యులు: మంచనభట్లుగారు పంచాంగం విప్పుడా ?

మంచనభట్లు: భైరవజ్యోస్యులు, తెగనిమాటలె అడుదువు. చక్కంగా అశ్వనిభరణి కృత్తికలు గురుతెరుగవు నీవు పంచాంగం విప్పేదిన్నా నీభవిష్టికి.

భై: మంచనభట్లుగారికి మూలానక్షత్రమే మాటాడకమునుపే మూలం రేగుతూఉన్నది.

మం: ఓరి భైరజ్యోస్సిగా! తిధివారనక్షత్రాల్లలో నొకటి గురుతెరుగవుగదా ! పంచాంగమనంగా కేందిరా?

భై: మంచనకు ముక్కుమీదనే వుండునుకోపం. అమావాస్యనాడు గ్రహణమనిన్నీ, ఆగ్నేయస్పర్శ ఆనిన్నీదబ్బరతేవ్రాస్తివే! మేముగ్రహస్ఫుటంచేసి గ్రహణము లేదంటిమే.

మం: నీవు పోచనసోమయాజులవారింట మొగవాండుపుట్టునని ప్రశ్నచెప్పి యేకాక్షరప్రయోగం చేయించుకవస్తివే!

భై: నీవు బుచ్చావధానికొడుకు బుచ్చిగాండు పదహారోయేంట పల్లకియెక్కునని జాతకంవ్రాస్తివే-ఇదిగో బిచ్చం యెత్తుకతిరుగుచున్నాండే ?

మం: శేషఫలభాగం వ్రాసినవారు పదివేలమంది పల్లకిపదస్థులు నీకేంతెలుసు పోరా.

మధ్యస్థులు: వోయి, చాలించరోయి, మీ జగడాలు, నగరివారుముహూర్తం నిర్ణయించమంటే ఏపాగాథా లాడుచున్నారు,

పు రో హి తు ల మా ట లు

కొండుభట్లమాట_అవునోయి యల్లుసోమయాజులు, నూరుతరాలనుంచి యీ యింటికి తగునైనపురోహితుండనేనుండంగా నీవెవ్వండికొడకవు నాస్వాతంత్ర్యం కొంగుముడిరూకతీసుకుపోయేటట్టుగ ?

యల్లుసోమయాజులు: ఏమోయి కొండుభట్లూ! మాతాతకు చవ్వపునాయనివారు పాకెనసంభావన కట్టడచేసివుండగా నీవెవ్వండవోయి అపహరించుకపోయేటట్టు. మా అన్నకొడకవా!

ము త్తై దు వు ల మా ట లు

యల్లమ్మ: అవునక్షేతిమ్మక్క నాకువక్క బ్రద్దా వకటికొడవా? చాలుచాలు; నిన్నమావారు సుక్కురారం సంతలో పిండికూరికంచున్నూ గానుగబిండిజెచ్చేరు. నోరుమెదలించవతెనంచున్నూ

తిమ్మక్క: పారుగింటి తిమ్మావధానిపెండ్లాం వీరమ్మ పాటలుపాడుతూన్నది. అంటుకొని నీవున్నూ పాడాదమవో.

యల్లమ్మ: ఇదేందో నీవు నాగపసానిలా పెత్తనంచేసుకు వుండేదానవున్నూ కడమవారు పాటలుపాడేవారున్నా.

తిమ్మక్క: వోశమ్మా-మాయింటిఅయన యెందుకో యెపషో యేవేళా రమ్మంచున్నారు. ఇక్కడంతా ముగవారేవున్నారు. నీవుధవళంయెత్తు. నేనుంగూడాపాడేగాని.

ఈ విధముగా నించుమించు గ్రంథమంతయు నుదహరించవలసియుంటుంది_ఈనాటకమున సున్నితమగు జాతీయమగుహాస్యము ప్రవచింపబడినది-ఇది రచయిత యపూర్వ రచనాసామర్థ్యము తెలియజెప్పును-ఇక యీమె కృతులు.

ఉ షా ప రి ణ య ము

ఇది ప్రబంధము-ఇందుషానిరుద్ధుల వివాహము వర్ణితమైనది-మూడాశ్వాసములు సమగ్రముగను, నాలుగవయాశ్వాసములో కొంతభాగము గలదు. అముద్రితమగు నీగ్రంథము తంజావూరిపుస్తకశాలలో (140 సంఖ్య) గలదు. ఇందులో విజయరాఘవనాయకుని వంశావళి సంగ్రహముగా గలదు. చక్కనికవిత్వము-శృంగారరస ప్రధానము.

మ న్నా రు దా స వి లా స ము నా ట క ము

దీనిని 1926లో నాంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) వారు ప్రకటించినారు. వారిప్రకటనము వలననే, రంగాజమ్మ వృత్తాంతము కొంతయైన యాంధ్రలోకమెఱిగినది. అయినను దీనినింకను మనసాహితీ విమర్శకులు చక్కగాచదివినట్లుకానరాదు. దీనిగూర్చి కీర్తిశేషులు, కళాప్రపూర్ణులు జయంతిరామయ్య

పంతులవారు 'తమ అధునాతనాంధ్రవాఙ్మయ వికాసము'న కొంత వ్రాసియున్నారు. ఇదియక్షగానమునుండి నాటకముగా నాడుపద్ధతిని వ్రాయబడినది. విపులవిమర్శతో తిరిగి ముద్రింపదగిన ప్రశస్తకృతి. నేనుముందు దాహరించినవిందునుండియే. ఇదివిజయరాఘవ నాయక కాంతిమతీ వివాహమునుదెలుపు నితివృత్తముగలది.

## మన్నారుదాసవిలాసము-ప్రబంధము-చిత్రకథ

రంగాజమ్మరచించిన యీకృతితంజావూరి పుస్తకశాలలో లేదు. కాని, మఱియొక కవయిత్రి 'సౌందరి' అనునామె దీనినిరచించినట్లుగా నందలిగద్యములు కూర్పబడి "అల్లాడ విజయసింహభూపతి విలాసము" అనుపేర మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాగారముననున్నది. దానిసంఖ్య 786. ఇది తాళపత్ర గ్రంథమే. వ్రాతనవీనముగ స్ఫుటముగనున్నది. ఒక్కొకదానియందు 14 పంక్తులుగలవు. ఈ గ్రంథము చదివినవారికిది యొకకూటసృష్టియని తోచకమానదు. ఏలననగా రంగాజమ్మ గద్యయందలి పేళ్లుమాత్రమే యిందుమార్పుచెందినవిగాని తక్కినవియన్నియు సమానమే. ఇప్పుడు ముద్రితమైన మన్నారుదాసవిలాస నాటకములోని పద్యములిందున్నవి. కాబట్టియిది రంగాజమ్మకృతియే, "సౌందరి" అనునామె యెట్లో సంగ్రహించి (ఆమెయు సంగీతసాహిత్యములనేర్చినదికాదగును) గ్రంథకర్తృత్వము నభిలషించి, దీనినిట్లు మార్పించియుండును. రంగాజమ్మగద్యలో "విజయరాఘవ" అని యున్నచో నిందు "విజయసింహ భూపతి"-అచట "పసుపులేటి" యన్న నిచట "రాచవేటి"-అచట "మంగమాంబ" ఇచ్చట "మూర్తికాంబ." యిత్యాదిగావెలసినవి. ఈ మార్పులు కేవలము పేరులలోనేయుండుటచే నొక్కొకపుడు యతిదోషములుగూడ గమనింపబడియుండలేదు.

ధీరాజుల చనవీరా
వీరాయిత కేళి నిన్ను వెలకు గొనెనురా
నేరాల కేమి రారా
రారాపులు మాని విజయభూపతి ధీరా!

ఇట్లుగా 14 వ పత్రమునగలదు "రారాపులు మాని విజయరాఘవ ధీరా" అనిగదా యుండ దగినది. కావున నీకృతి రంగాజమ్మదేయనుట నిక్కము.

అముద్రితమగు నీ గ్రంథమునుండి కవిత్వశైలిని తెలియుటకు 'వసంతవర్ణన' నుండి కొన్ని పద్యములు దాహరించుచున్నాడను.

పఱగన్ జైత్రుఁడు నవ్యసూత్రలతికా పాణిగ్రహం బందుచున్
మెఱయన్ మల్లికలుఁ దరువ్రజములు స్వేచ్ఛందంగా నత్తరిన్
తెఱగొప్పన్ విడి పాణిపల్లవములన్ దీవ్యన్నవామోదముల్
నెఱయన్ దాల్చిన సేసబ్రాలనగ గన్పించెన్ ప్రసూనావళుల్.

బాహుబలశాలి మరుఁడు
త్సాహంబున జగముగెలువ తరలెడు-చో స
న్నాహంబు దెల్పు తత్ఘన
కాహళ రావములన నళికధ్వను లెసగెన్.

కోమరుమీఱిన నవపల్లవముల కాంతి
గాఢమౌసాంధ్యరాగంబు కరణిమించ
నపుడు గనిపించె నందందు నందముగను
తారకంబు లనంగను కోరకములు.

తరుణీజన మానమద
ద్విరదంబుల మదమడంప దివురుమరునికిఁ
దరమగు రత్నాంకుశముల
మురువుగ గనుపట్టెనపుడు మోదుగమొగ్గల్.

మలయానిలయానిలుం డను మంత్రవాది
యచట భ్రమరాక్షసరము ద్రిప్పుచును మఱియు
పొసగ కుసుమ పరాగంబు భూతి జల్లి
సల్పె యువతి మానగ్రహోచ్చాటనంబు.

ఈ మన్నారుదాస విలాసమునసే రంగాజమ్మ యొకదండకముకూడ విజయరాఘవుని పేర రచించినది. అదియు నైవిధముగా మార్పుచెందినది. అల్లాడవిజయ సింహభూపతిపై "మోహిని" అను నామె మరులుగొనుట, పొందుట యిందలివిషయము. ఇదియు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకశాలలో "మోహినీదండకము" అను పేరగలదు. సంఖ్య 2001. మన్నారుదాసకావ్యము, నాటకము రెండును విజయరాఘవనాయకుని చరిత్రాత్మకములే గానివేఱు కాదు. రంగాజమ్మ కృతులిట్లితరులకృతులుగా మార్పుచెందు నవకాసమున్నదనుటకు మఱి యొకవృత్తాంతముగూడ నిటదెల్పెదను.

"విజయరాఘవ నాయకుడెల్లప్పుడును నీమెతో (రంగాజమ్మతో) నానందించుటచూచి, యాతని పట్టమహిషి యాగ్రహము నాపుకొనజాలక యొకదూతికమూలమున దూషణోక్తులతో నొకవార్తనంపెనట! దానికి విదుషీమణియగు రంగాజమ్మ దూతికీపద్యము జవాబునిచ్చెనట.

ఏవనితల్ మముందలఁప నేమిపనో? తమ రాడువారు గా
రో? వలపించు నేర్పెఱుఁగరో? తమకౌఁగిటిలోన నుండఁగా
రానవదేమిరా? విజయరాఘవ! యంచిలుదూఱిబల్మిచేఁ
దీవరకత్తెనై యిటుల తీసుక వచ్చితినా తలోదరీ!

మఱియు నంతఃపురములో నిట్టిసందర్భములో చెప్పినచాటువులు:

'రాజనిభాననా! సరసురాలవు; జబ్బుగ నల్లినావదే
మేజడ?' 'యింతకంటెవలెనే?' 'వలనొప్ప బిగించియల్లవే
ఓజవరాల! వేఱెపనియున్నది'-'దోసమె?' దోసమే! మహా
రాజగునట్టి యవ్విజయరాఘవుకై చిగురాకుకోమలీ!
కులికెదవేటికే చెలియకుంచెడు మానెడుగాను నెల్లవా
రలు వినినారులే! విజయరాఘవరాయఁడు నిన్ను గూడుటల్!
వలపులెచాటుచున్నవి; జవాదియు నల్లవు; విట్టివీగఁగా
వలెనటె?చూచి యోర్తురటె వంతులుజంతు? లవేటియెమ్మెలే?

"ఇంతీపానుపుపై నిదె
కంతుడు కూర్చున్నవాడు; గనుగొను!" "వహవా,
కంతుడ నంగుఁడు; నీ తెలి
వింతేనా? విజయరాఘవేంద్రుఁడు, చెలియా!"

పైపద్యములు 'విజయరామ' అనుమార్పుతో విజయనగరరాజు (కళింగదేశమున) విజయరామరాజు అడిదము సూరకవిచెప్పినట్లు కీర్తిశేషులు గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు సూరకవిచరిత్రలో వ్రాయుచున్నారు. ఆవైపున నీ పద్యములు సూరకవివనియేవాడుక. (పై పద్యములుచాటుపద్యమణిమంజరి ప్రథమభాగమున 63, 64, పుటలలో బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించియున్నారు.)

రంగాజమ్మ కులమునుగూర్చి యొక్కమాట

రంగాజమ్మ వారాంగనయని పూర్వచరిత్రకారు లభిప్రాయపడియున్నారు. వీరుజన్మముచే నట్లైనను నుండియు, సంస్కారవిశేషముచేత, సాంఘికజీవితము నందత్యున్నతస్థానము నాక్రమించినవారు. రఘునాథరాయలకాలమున, రామభద్రాంబ, తిరుమలాంబ, మధురవాణి; విజయరాఘవునికాలమున రంగాజీ, కృష్ణాజమ్మ మున్నగువారు కులమున వేశ్యలేయైనను, ఏకచారిణీ వ్రతమునను సరించినవారు. (అనగా జీవితకాలమంతయు నొకేనాయకుని ననుసరించియుండువారు.) కావుననే వీరిలోకొందఱు, తమనాయకులకు ధర్మపత్నులని చెప్పికొన్నారు. రంగాజమ్మయు నట్టి యేకచారిణీవ్రతసంపన్నురాలై సాహిత్యసామ్రాజ్యము నధిష్ఠించి పూజ్యురాలు. పరిశోధకశిఖామణులు, విద్వద్వర్యులు మానవల్లి రామకృష్ణకవిగారు 'మధురవాణిని'గూర్చివ్రాయుచు నీ విషయమున పైయభిప్రాయమునే వ్యక్తపఱచినారు.

ఏనాటిసాంఘికపరిస్థితుల కానాటిసాంప్రదాయములననుసరించి విమర్శింపవలెను. నేడును నీకులజులు సంగీతసాహిత్య విద్యాసంస్కారసంపన్నులై, ఉత్తమశ్రేణిలోజేరిన తారాగణములై ప్రకాశించుచుయున్నారు. కావున రంగాజమ్మయు, సర్వాంధ్రలోకమునకు, సంతతస్మరణీయయు పూజ్యయు ననుట నిర్వివాదము. రంగాజమ్మకృతులు నవీనసాహితీరంగము నలంకరించుగావుతమనీ, దానికి "శ్రీగృహలక్ష్మి" పత్రికాధిపతులు, తోడ్పడుదురనీ సంభావించుచు, నీకవయిత్రిచరిత్ర యింతటితో ముగించుచున్నాడను

# అమ్మా!

హిందీలో రచయిత:
శ్రీమతి ఉషాదేవిమిత్రాగారు
అనువాదకురాలు : శ్రీమతి
సోం. గోవిందమ్మదేవిగారు

"ఆలోకా" కు ప్రపంచంలో తనవారు అని చెప్పుకోనేందుకు ముగ్గురు చిన్న చిన్న పిల్లలు మిగిలి ఉన్నారు. పట్టణంయొక్క కోన లోఉంది ఆమెయొక్క జీర్ణించిన కుటీరం! అదే సుఖదుఃఖములకు అన్నిటికిని ఆశ్రయం :



ఎండాకాలంలో ఆయింటిలో అగ్నిపర్వతం నృత్యం చేస్తూంటూంది. వర్షాకాలంలో వర్షము యొక్క ఎడతెగని ధారలు ప్రళయముయొక్క పూర్వస్థితిని సూచిస్తూంటాయి. చలికాలంలో చల్లదనం హిమాలయాన్ని స్మరణకు తెస్తూంటూంది. పిల్లలను హృదయంతో అద్దుకుని, "ఎప్పుడు పొద్దుపోదు కునా!" అనే జిజ్ఞాసతో కూర్చొనిఉంటుంది! ఆమె ఒక బిక్షుకురాలు.

దినాలన్నీ ఒకలాగే నడుచుకుపోతూన్నాయి. వాటిలో మార్పులేదు, ఆనందమూలేదు. కాని ఉంది, నిత్యశూన్యంతో యుద్ధంచేయడం. కష్టనష్టాలను ధైర్యంతో ఎదుర్కొనడం, ఆత్మగౌరవాన్ని దారిద్ర్యహోమంలో ఆహుతిచేయడం, తెల్లారయిన దగ్గర్నుంచి సాయంకాలందాక గడపగడపకు బిచ్చమెత్తుకుంటూ తిరుగుతుంది ఆలోకా. దయగలవారు ఓపిడికెడు బియ్యం, నాలుగుడబ్బులు ఇస్తారు. అప్పుడప్పుడు చింకిగుడ్డలుగూడా దొరకడంకద్దూ. ఒక్కొక్కప్పుడు బిచ్చానికి బదులు చీవాట్లు దొరుకుతూంటాయి. పాపం! పసిపాపలు దినమంతా రోడ్డుమీద ఆటలాడుతూంటారు. సాయంకాలమయ్యేసరికి అమ్మకొరకు కనుచూపుమేరవరకు రోడ్డుమీద నిలుచొని చూస్తారు. అమ్మరావడం ఆలస్యమైతే చిన్న లేత చేతులతో ఒకరికొకరు బంధించుకొని ఆచెట్టుక్రింద పండుకొంటారు. అమ్మ యింటికివస్తుంది. జాలి నేత్రాలతో బిడ్డలను చూస్తుంది. పిమ్మట పనిలో నిమగ్నురాలవుతుంది.

సాయంకాలమయింది. ఆనాడు ఆలోకాకు ఏమియు దొరకలేదు. దేశమంతా అలముకున్న క్షామంవల్ల ఆలోకాకు కొన్ని నెలల్నుంచి కావలసినంత బిక్ష దొరకడంలేదు. ఆమె పూర్తిగా అలసి ఉంది. కాళ్లు ముందుకుసాగటంలేదు. దప్పికచే కంఠం ఎండిపోతుంది. ఎదురుగాఉంది చక్కనిబంగళా. ఎలాగో అతికష్టంగా బంగళాయొక్క ద్వారంవద్దకు వెళ్ళి నిలచింది. గేటుదగ్గర కారు వచ్చినిలుచొని ఉన్నది. ఇద్దరు యువతులు బయటకువచ్చారు. వజ్రముత్యాలతో కూర్చిన ఆభరణాలు ధరించిఉన్నారు. ఆలోకాలో ఆశ, విశ్వాసరేఖలు ఉదయించాయి. మిక్కిలి వినయంతో చేజోడించుకొని ముందుకు వెళ్ళింది— "దినమంతా నాబిడ్డలు ఆకలితో ఉన్నారమ్మా! కాస్తపిడికెడు గింజలు యిప్పించండి"— అంది. "పో, దూరంగా యిక్కణ్ణుంచి, కొంచెం చూచినదువు! తాకేవు జాగ్రత్త. ఊర్మిలా! ప్యూన్ చచ్చాడా ఏం? వాణ్ణిపిలువు. దీన్ని మెడపెట్టి గెంటెయ్యి"—అంది ఒకయువతి కనుబొమ్మలు చిట్లించుకొని.

, అవమాన దాహంతో వణకిపోయింది ఆలోకా బిక్షుకురాలయినా మానవులందరికిలా ఆమెకు గూడా మనస్సు, హృదయం, ఆత్మ ఉన్నవి. వాటిలో ఎల్లప్పుడు ప్రేమ, స్నేహం, దయ, మాయ, లోభము, మోహము, చింతా, ఆత్మాభిమానం మొదలైనవి ఏరులై పారుతూంటాయి. ఆ దుఃఖితహృదయంలో అప్పుడప్పుడు ప్రశ్నలు వర్షంలా కురుస్తూంటాయి:— "కేవలం పతిలేకపోవడం మాత్రాన్నా స్త్రీ బిక్షుకురాలయిన, ఆపాడుదైవం, స్వామిని లాక్కెళ్లిపోవడం దేనికి? భూమిలో దారిద్ర్యమే మిక్కిలి అసహ్యమగు లజ్జాకరమగు వస్తువయినా, ఆ అన్యాయదైవం, క్షణంలో

రత్నాస వాలంకృతునిజేసి, మళ్ళా గౌరవ సుఖాలకు స్థానమయిన ఆసనాన్ని తీసుకోవడం ఎందుకు? ప్రపంచం నాకు, నాబిడ్డలకు సహాయంచేయకపోతే మానె, మమ్మల్ని నిందించేందుకు అధికారం దానికి ఎప్పుడు, ఎలా దొరికింది? నాకు భిక్షఎందుకు దొరక లేదు? మానవురాలు నయినప్పటికి తాకరానిదానినిగా ఎలాగ అగుచున్నాను? —ఇలాంటి విచిత్ర ప్రశ్న లను అర్థంచేసుకొనేందుకు, ఆమె ఘంటలకొలది మనస్సులోనే తటపటాయిస్తూంటూంది. ఆఖరకు ఆ విచారాలన్నీ మనస్సులోనే అణచివేయవలసివస్తుంది ఆమెకు. కాని ఎవరితో చెప్పుకుంటుంది. వినేవారుం టేగా. దరిద్రుల ప్రశ్నలువినేవారు మహాప్రపం చంలో ఎవరైనా ఉన్నారా? అనేవిషయం ఆమెకు సందేహంగాఉన్నది. ఆమెఅందకత్తె. కొన్నిగడపల వద్ద రూపముయొక్క పొగడ్త-పాపం! ఆమెకు వినాల్సి వస్తుంది. పరిహాసంచేసేవారు కొందరు. మృదువైన చేతులలో మొహాన్నిదాచుకొని వెనక్కు పరుగెత్తిపోతూంది. హాహాకారాలతో అంతఃకరణము నిండుతుంది. రకరకాల ప్రశ్నపరంపరలు పుట్టుతూం టాయి. వ్యథతో హృదయం కలత జెందుతుంది. ఎలాగయిన ఆమె భిక్షుకురాలు. అందరుఆమెను "భిక్షమెత్తుకునేది" అంటారు. భిక్షయే ఆమెయొక్క జీవితం.

యువతియొక్క ముఖలక్షణాలు చూచి మెల్లగా జారిపోవాలనుకుంది. ఇంతలో రెండవ యువతి పరిహాసంగా అడిగింది "ఏయ్? బిచ్చమెత్తుకతిరుగు తున్నావే, అయితే బిడ్డలుగూడా ఉన్నారాఏం?"

"అవునమ్మా, ముగ్గురు బిడ్డలున్నారు"— అలోకామొహంలో ఆశారేఖలు ప్రతిబింబించినవి.

ఇంటిలో తినడానికి తిండిలేనప్పుడు "తల్లి" అగుటకు ఉబలాట పడ్డావెందుకో? —అంది.

అలోకా మెల్లగా తొలిగిపోయింది. ఆమెలో ఓ తరహా ఆవేదన పుట్టింది.

ఎండిన ఆకులు పోగుచేసి అలోకా అగ్గి రాజేస్తుంది. "విమల" పిలుపువిని ఉదాసీనదృష్టిని పైకెత్తి—"ఏమిటీ"—అంది.

విమల అలోకాయొక్క కర్కశస్వరాన్ని గుర్తించలేదు. వచ్చికూర్చొంది. కోమలస్వరంతో చెప్పింది—"తీసుకో సోదరి, చారూబాబూ నీకిమ్మని దీన్ని పంపారు."

"ఎందుకు మాటిమాటికి నీవు నన్ను, నాపిల్ల లను అవమానపరచేందుకు వస్తున్నావ్, వెళ్లు—నీ సామానులు తీసుకొని మరీవెళ్లు."

"నీవు చిన్నదానివి, తెలుసుకోలేవపోతు న్నావ్, మళ్ళా ఒకసారిచెపుతున్నా విను, వెనుక పశ్చాత్తాపపడాల్సి వస్తుంది. ఇలాతినకుండా ఎంత కాలమని ఉంటావ్? ఈబిచ్చంమీద ఎన్నిదినాలు నెట్టుకుపోగలవు? దీనివలన నీవేగాదు, నీముగ్గురు పిల్లలుకూడా కష్టాలను ఎదుర్కొంటున్నారు. నా యజమానిమాట విన్నావా, చూడు, నీవుమేడల్లో ఉంటావు. మేమంతా అనుదినం నీపరిచర్యలుచేస్తాం, పిల్లలు బాగాచదువుకొని పెద్దమనుష్యులనిపించు కుంటారు. చారూబాబూలాంటి ధనవంతుడు ఈ పట్టణంలో ఎవడున్నాడు? ఆతనిదృష్టి నీమీద పడినందుకు అదృష్టానికి ధన్యవాదం చెప్పుకో—"

విమల ఎంతో హితాన్ని కోరేదానిలా ఉప దేశమిస్తున్నది. అలోకా అన్నిటిని ధీరతతో వింటూ న్నది.

అందులో కొన్నివాక్యాలు ఆమె వినిందో లేదో తెలియదు.

"వెళ్లు, నేను బిడ్డల్ని యిప్పుడే పండ బెట్టెదను"—అంది అలోకా. పెద్దధాన్యంబస్తాని బయ టకు తోసివేసి కుటీరంతలుపు మూసేసింది. విమల ఏదో సణుక్కొంటూ పోయింది.

"అమ్మా! ఆకలేస్తుందే, గుప్పెడు శనగలు ఈయవే అమ్మా! ఇవ్వు అమ్మా! నీ కాళ్లమీద పడతా"

"అమ్మా! అమ్మా! మాటలాడవేమే? వినడం లేదూ? నేచచ్చిపోతాను, ఒకముక్క రొట్టియివ్వమ్మా అమ్మా, త్వరలో యివ్వే."—

ఇద్దరు పిల్లలు ఏడుస్తున్నారు. మూడవవాడు నిర్జీవుడై కుటీరంయొక్క ఓకోనలో పడియున్నాడు. అలోకాకు ఏమితోచడంలేదు, ముఖాన్ని మోకాలికి ఆనించి కూర్చొనిఉంది. మృత్యుభయంవలన ఆజీర్ణ కుటీరము స్తబ్ధమగుచున్నది.

విచారసాగరంలో మునిగిఉన్నందున బిడ్డల ఆక్రందనాలు ఆమెకు వినిపించడంలేదు.

"అమ్మా"—వెంటనే అలోకా తుళ్ళిపడింది,—ఇంకా చచ్చిపోలేదుఆబిడ్డ. బిడ్డదగ్గర కెళ్ళిందిఅలోకా. ఊపిరిఆడుతుంది. చెవియొగ్గివిన్నది. అవును కొనఊపిరి ఉన్నది. ఆమెను కర్చుకొంటున్న పిల్లలిద్దర్ని అవలతోసి గబగబ బయటకు పోయింది అలోకా,—

చారూ ఎదుట అలోకానిలుచున్నది. చారూ నోటివెంబడి మాటరాలేదు. అతనికి విశ్వాసం కలగలేదు. "ఇచ్ఛాపూర్వకంగా అలోకా వస్తుంద" ని ఆయన అనుకోలేదు. "నీవా? అలోకా! ఏమిది నిజమేనా? స్వప్నం కాదుగద?"—ఆవేశముచే వణకుతూన్న కంఠంతో అన్నాడు చారూబాబూ.

"నేను అలోకాను"—అలోకాభయంచే వ్యాకులపడుచున్నది. చారూబాబూ రెండు బాహువులు ముందుకు సాచాడు, "రా అలోకా! నావైపు చూడు, కళ్ళెత్తు అలోకా!"—రెప్పయార్పకుండా ఆమెను చూచాడు చారూబాబూ. అప్రియత్నంగా రెండుఅడుగులు వెనక్కువేశాడు. గజగజవణకి పోతుందిశరీరం! చారూ ఎవర్ని ప్రేమించడానికి వెళ్ళాడు—అమ్మ—అమ్మతోనా? అలోకానేత్రాల్లో తల్లియొక్క ప్రశాంతమైన ప్రేమజ్యోతి వెలుగుతున్నది. సుందరంగానున్న ఆముఖకమలం నిండుప్రేమతో ప్రకాశిస్తున్నది. ఆమెయొక్క ప్రతీనరంనుంచి మాతృస్నేహం ఉబికివస్తుంది. తల్లి ముందు తుచ్ఛలాలసత్వం మటుమాయమయింది. పశుత్వంపోయింది. దేవత మేలుకున్నది. అంధకారం నశించింది. జ్ఞానప్రకాంతులు నలువైపుల ప్రసరించాయి—చారూ చేతులుజోడించి అలానిలచి పోయాడు.






## బిటా కేఫిన్ (తలనొప్పి బిళ్లలు)

తలనొప్పి, పంటినొప్పి, కాళ్లనొప్పి, నిద్రలేకుండుట, కీళ్ళనొప్పులు, మలేరియా, స్త్రీల బహిష్ఠునొప్పులు, అలసట వగైరా అన్నిటికి గ్యారంటీగా పనిచేయును.

వాడుకొనువిధము పొట్లములోనుండును.

పొట్లం 3 బిళ్ళలు 1 అణా.

## బిటాలాక్సు (చాక్లెట్ భేదిబిళ్ళలు)




సుఖవిరేచనౌషధము

ఇది చాక్లెట్ భేది బిళ్లలు. సుఖ విరేచనము కలిగించి మలబద్ధమును పోగొట్టి మంచి జీర్ణశక్తి నిచ్చును.

అన్నిచోట్ల దొరకును. పొట్లం 2 బిళ్ళలు 1 అణా.

స్టాకిస్టులు:—దాదా అండ్ కంపెనీ,—పి. టి., మద్రాస్.

తయారుచేయువారు :

**Bombay Tablet Manufacturing Co.,**
**Post Box No. 2092, BOMBAY 2.**




అరుణ స్త్రీలకు వరప్రసాదం వంటిది. ఇది స్త్రీలకు కలిగే ఋతు సంబంధ వ్యాధులన్నిటిని పారద్రోలి జీవనమునకు ఆనందమును, మాధుర్యమును, సౌరభ్యమును చేకూర్చును.

**ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్, మదరాసు 17.**

# చిత్ర ప్రశ్న

రూపంబు వుండియు హృదయముండని దేది?
గాలికంటెను వడిగలది యేది?
రోగపీడితునికి గృహాయజమానికి
ఆప్తబంధుగెవరు నవనియందు.
నిదురించినను నేది యిలఁగన్నుమూయదు?
మనుజుడెటుల బుద్ధిమంతుడగును?
బ్రతికియుండుయు నేది ప్రాణంబులేనిది?
అనవరతము పడిగలది యేది ?

ధర్మములలోన నుత్తమ ధర్మమేది?
పెద్ద సుఖముల కాధారమెద్ది? చెప్పఁ
జాకచక్యంబు గలిగిన చానలెల్ల
జెప్పుకొనరమ్మ మీనేర్పు మెప్పుకొనగ.

వి. మనోహరి

●

## సమాధానములు

1 పడతి—వ్రతము—పతివ్రత

2. 'బాబు, బువ్వనిపిలచె' తండ్రిని కూతురు 'రార, బాబు, బువ్వని తల్లి పుత్రుణ్ణి పిలచె.

47 వ డిశంబరు సంచికలో ప్రచురించిన చిత్రప్రశ్నలకు యీదిగువవారు సరియైన సమాధానములు పంపారు.

శ్రీమతులు కొత్తపల్లి శ్రీకాంతమ్మ గుంటూరు. కె. విజయలక్ష్మి, బాపట్ల; పాతూరి లక్ష్మీనరసమ్మ, మైలవరం; ఎం. ఎ. పూర్ణావతి, ఏలూరు; పాలెపు సుబలాదేవి, తిరుత్తని; పోవూర్తి రాజేశ్వరి, ఏలూరు; వి. మనోహరి, గ్రీంసుపేట.

# శిశువాఙ్మయకలాపం

డాక్టర్ పోలంకి శ్రీనివాసరావుగారు,

## అ ✓

### వందనం



జనక తనయ వర
కనక వసన ధర
ఖగ వర గమన
వన చర రమణ
భవ భయ హర
నవ రస భర

కమల నయన
అమల చరణ
ఇనజ భరణ
వనజ వదన

వందనం
వందనం.

## ఆ ా

### బాలపాట

బాల పాట పావనం.
బాల మాట భారతం.
నారాయణ నామ రసం
పారాయణ వలన ఫలం.
భరత మాత సంతసం
భరత బాల కాదరం.
మహా శాంత మానసం
పంచదార పాయసం.
సకల జన సమాదర
జగాన పరమ సాధనం.
ఇంట చరఖా సాధకం
పంట గల ధన భారతం.
ఘన పతాక పాలనం
మంగళంకర భారతం.



# ఆభరణములు, అంగరాగములు.

రచన: రాము.

ప్రపంచములో నతిపురాతనకళలలోనొకటి వ్యవసాయము. అంతకంటే పురాతనమైనకళ స్త్రీ శరీర మలంకరించుకొనుట. నాగరికత హెచ్చుకొలది, విజ్ఞానమభివృద్ధిచెందుకొలది, ఈ కళగూడా మార్పు పొందినది.

ఆభరణములలో వజ్రము మిన్న. ప్రకృతిలో నిది దొరికినపుడు దీనికి రాతిముక్కకు ఏలాటి భేద ముండదు. దీనినికోసి మెరుగుపెట్టినపుడే మిరుమిట్లు గొలుపుకాంతివచ్చును.

రసాయనికదృష్ట్యా వజ్రము, పొగగొట్టములో నేర్పడే మసి (Soot), పెన్సిలులోని నల్లసీసము, బొగ్గు, ఇవన్నీ ఒకటే. ఈ రహస్యము తెలిసినతర్వాత శాస్త్రజ్ఞులు వజ్రమును ప్రయోగశాలలో తయారుచేయవలెనని ప్రయత్నించిరి. 1897 లో మాయిసనను ఫ్రెంచి రసాయనికుడు వజ్రముల సృష్టించితినని ప్రకటించెను. అతడు చక్కెర కాల్చినవచ్చు స్వచ్ఛమయినబొగ్గునుఒకమూసలోనున్న ద్రవరూపములోనుండు ఇనుములో కరగించి, తటాలున ఆవేడిమూసను ద్రవముగానున్న సీసములో ముంచెనట. అప్పుడు చక్కెరబొగ్గంతయు స్ఫటికాకృతినొంది వజ్రములుగామారెనట. మాయిసను తర్వాత శాస్త్రజ్ఞులెవరు వజ్రముల తయారుచేయలేక పోయిరి.

అల్యూమినము (Aluminium) సామాన్యముగా ప్రకృతిలో కురంజి (corundum) అను ఖనిజముగా సంభవించుచుండును. స్వచ్ఛమయిన కురంజికి రంగులేదుగాని కొన్నిరంగులుగలిగియుండును. ఇంద్రనీల (Sapphire) పద్మరాగ (Rubies) మణులు, నీలము, ఎఱుపు రంగులుగల కురంజిరూపములే. పద్మరాగము లిపుడు అల్యూమినామ్లజనిదమునుండి కృత్రిమముగా తయారుచేయబడుచున్నవి.

వైడూర్యములు అనబడు మణులు అల్యూమినము, విదురము (Beryllium) అను రెండులోహముల శైలితములు (Silicates). ఈ మణులు సహజముగా రంగులేనివి. గాని రంగు ఇతరధాతువులచే గల్గింపబడును. అతిగాఢమయిన ఆకుపచ్చరంగుగల వైడూర్యమునకు మరకత (Emerald) మనిపేరు. నీలపుచాయగల మరకత మునకు పచ్చరాయి లేక నీలమరకతమనిపేరు. నీలమరకతము లతిమనోహరముగానుండును.

ముత్యములు జంతుసంబంధమయినవి. గుల్లచేప (Oyster) చిప్పలో ఒక్కొకమారు ఏదోకఠినమయిన ఇసుకవంటి పదార్థము ప్రవేశించి దానియందు క్షోభగలిగించును. పురుగు దానిని విసర్జింప నశక్తతచేత అది ఒత్తుకొనకుండ దానిచుట్టూ మెత్తని పదార్థమేర్పరచును. ఇదే ముత్యముగా మారును. ముత్యములు, సున్నపురాయి రసాయనికముగానొకటే. సున్నపురాయివలెనే ముత్యములు ఆమ్లములవలన పొడిసున్నముగా మార్చబడును. ముత్యములు చాలఅందముగలవి. కాని త్వరలోనవి గీతలు, నొక్కులుబడి చెడిపోవును.

జపానులో 'కల్చర్' ముత్యములని తయారుచేయబడును. వీటిని తయారుచేయుట పూర్తిగా ప్రకృతి ననుకరించుటయే. మెత్తని పురుగులు (Molluscs) బ్రతికియున్న ముత్యపుచిప్పలోనికి చిన్నముత్యపుముక్కగాని, వేరేదయిన కఠినపదార్థముగాని యుంచబడును. కొంతకాలమునకు ముత్యము ఏర్పడును. ఈ ముత్య

ములు కృత్రిమములయినవని గుర్తించుట అసాధ్యము. గాని అతినీలలోహితకిరణములు (Ultra violet rays) వీటిపైబడినపుడు పచ్చని ప్లవకాంతినిపొందును. మంచిముత్యములు మేఘనీలప్లవకాంతినిపొందును.

ఆభరణములతర్వాత అంగరాగములు పూర్వమునుండి వాడుకలోయున్నవి. పూర్వము మనస్త్రీలు రోజూస్నానమునకు చందనము, ముఖమునకు లోధ్ర పుష్పాడి, చరణములకు వివిధలేపనములు వాడుచుండిరి. ఈనాటికీ హిందూవనితలు పసుపు ముఖమునకు రాచుకొనెదరు. కొంతమంది ఈనాటికీ గోళ్లు (Nails) ఎఱ్ఱగా నుండవలెనని గోరింటాకురసము గోళ్లకు పూయుదురు. అందముగానుండవలెనని కంటికి కాటుక పెట్టుకొనెదరు. ఈ విధముగా అంగరాగములు బహుపురాతనకాలమునుండి స్త్రీలనలంకరించుచున్నవి.

కాని ఈనాడు పాశ్చాత్యవ్యామోహముగల యువతీయువకులు పాశ్చాత్త్యుల అంగరాగములు, పౌడరు, క్రీము, స్నో మొదలయినవి వాడుచున్నారు. ఇవి అపాయకరములయినవా? అనుప్రశ్న చాల ముఖ్యమయినది. అయితే ఒకటి మాత్రము నిజము. అంగరాగములు నవమన్మథాకారము ప్రసాదించునను కొనుట శుద్ధతప్పు.

చర్మము ఆరోగ్యముగానుండినపుడు చెమట (Sweat) నిరంతరము కారుచునేయుండును. దేహముచే విసర్జింపబడిన పదార్థములు కరగిననీరు, చర్మము మృదువుగాయుంచు స్నేహగ్రంథుల (Sebaceous glands) నుండి వెడలు నూనె కలసి చెమటగానేర్పడును. చెమట ఆవిరియైపోవుటచేత దేహముయొక్క శీతోష్ణపరిస్థితి క్రమపర్చబడును. చెమటపట్టనీయని అంగరాగములు చాలఅపాయకరములు.

నేటి ముఖచూర్ణము (Face-powder) లలో బలపపురాయిపిండి (Talc), తెల్ల సుద్ద (Lime stone), తిరుమణి (kaolin), బియ్యపుపిండి, యశద, తితనామ్లజనిదములు (Zinc and Titanium oxides), మగ్నకర్బనితము (Magnesite) కాలిసిలికామ్లము మొదలయినవి వాడబడుచున్నవి. ఇవేవీ చర్మమునకేలాటి తాపజనకములు (Irritants) గావు. బలపపుచూర్ణము మెత్తగా నున్నగాయుండునుగాని నీటిలోకరగదు. కాబట్టి దీనితో బోరికాసిడ్, మగ్నకర్బనితముకలిపి పౌడరుచేసెదరు. ఇట్టిపౌడరు చర్మమునకు నునుపుదనము కలిగించును. మగ్నకర్బనితము చెమటలోకరగును. బోరికాసిడ్ క్రిమిజన్యదోషములహరించి చర్మమునకు కుపశమనము గలిగించును. ఇట్టిపౌడరు చిన్నపిల్లల కధికముగా వాడబడును.

ముఖస్థైర్యము (Face creams) లలో లినోలిన్, పెట్రోలేటరి, బాదమునూనె, ప్యారఫీను మైనము పటిక (Alum), మధురిక (Glycerine), బోరికాసిడ్ మొదలగు పదార్థములు ఉపయోగింపబడుచున్నవి. ఇవి అపాయకరములుగావు.

ముఖము సబ్బునీటితో సాధారణముగా శుభ్రపర్చుకొన నిష్టములేనివారు, శుచిచేయు స్థైర్యము (cleansing creams) ల నుపయోగించెదరు. ఇవి చెమటలోజిడ్డు, మురికి కరగించివేయును. తర్వాత ఒక టవలుతో తుడిచివేయవచ్చును. వీటిలో ట్రైయొథనాలమైనను పదార్థమువాడెదరు. ఇట్టిదే కార్బిటాల నునదిగూడ. ఇది చర్మమున కుపశమనకారి.

రోమహారిణులచరిత్ర చాలఅపూర్వమయినది. చర్మపుపరిశ్రమలో తోళ్లకున్న వెంట్రుకల పోగొట్టుటకు తాలపగంధకిదము (Arsenic Sulphide) వాడబడుచుండెను. తర్వాత దేహముపై వెంట్రుకల నిర్మూలించుటకుగూడ నిదేవాడుచుండిరి. కాని ఇది విషముగాబట్టి చెడుపుగలిగించుచుండెను. నేడు భార, ఘటక, స్ట్రాంత, సోడియ గంధకిదములు, ఏలాటిచెడుపు చేయవుగాబట్టి వాడబడుచున్నవి. దురదృష్టవశాత్తు ఈ పదార్థములెవ్వియు రోమమూలముల (hairroots) నాశనము గావింపవు. కాన, ఇట్టి రోమహారిణుల (Depilators) వాడినను వెంట్రుకలు మరిమరీ పెరుగుచునేయుండును. వెంట్రుకలు పెరుగుటకుగాని పెరుగకుండుటకుగాని సురక్షితమయిన పదార్థమేదియునులేదు.

అంగరాగములలో తెల్లసీసము (White Lead), భాండువకర్పూరము (corrosive sublimate) బెల్లడోనా మొదలగునవివాడిన చెడుపుచేయును. సబ్బుగూడ యొకఅంగరాగమే. కొన్నిసబ్బులు ఎక్కువ క్షారముగలవైన చర్మముపాడుచేయును. అట్లే అంగరాగములలో చెడ్డవిలేకపోలేదు. శ్రేష్ఠమయినవి ఏరివాడుకొనుట మన బాధ్యత.

కురూపులనుగూడ కొంతవరకు అందముగా కనిపించునట్లుచేయగలవి అంగరాగములు. ముఖచూర్ణములు, లాక్షారాగములు, పెదవిపుల్లలు (Lip-sticks), స్నోలు, కొంతవరకు కృత్రిమసౌందర్యమివ్వగలవు. కృత్రిమమయిననేమి? సహజసౌందర్యవిహీనులకు అదియేచాలు. సినిమాతారలు సహజముగానెంత కురూపులయినను అంగరాగముల ప్రతిభచేత ఎందరో యువకులు ప్రేమించునంతటి సౌందర్యవతులుగా నగుపడుటలేదా? ఆభరణములు అంచుచీరలు అంగరాగములవలెనే కృత్రిమసౌందర్యదాయకములేకదా! కాబట్టి అంగరాగములు వాడుటలోతప్పులేదు. కాని నిరపాయకరములు, క్షేమదాయకములునగు అంగరాగములే ఏరి తీసి వాడవలెను.

త్వక్‌శాస్త్రము (Dermatology) అభివృద్ధియగుకొలది, చర్మముయొక్క అవసరములు (needs) వైజ్ఞానికుల దృష్టినాకర్షించినది. ఫలితము ఈనాడు నూతనవిజ్ఞానశాఖ-అంగరాగశాస్త్రము (Science of cosmetics) అనునది బయలుదేరినది. దీనితో ముఖాకృతి నిర్మించు శస్త్రక్రియ (Plastic surgery) వృద్ధియగుచున్నది. శాస్త్రజ్ఞులు, సౌందర్యము ఆహారమువలెనే మానవునికవసరమని గుర్తించుట ఆనందదాయకమైన విషయము.

# మా బావ ★

★ శ్రీమతి పొన్నపల్లి అన్నపూర్ణాదేవిగారు

మా బావ చిన్నప్పటినుండీ మా యింట్లోనే వుంటూఉండేవాడు. నేను, మా బావ కూడ యెప్పుడూ స్నేహంగావుంటూ, ఆటపాటలలోను, చదువువిషయంలోను, సమంగా వుంటూవుండేవాళ్లము. నాతరువాత నాతల్లిదండ్రులకు మరల పిల్లలులేకపోవుటచే, నన్నూ, మాబావను కూడ యెంతో గారాబంగా చూచుకొంటూవుండేవాళ్లు. మేము వున్నవూరు ఒకమాదిరి పల్లెటూరుఅగుటచే, నాకు సామాన్యపు చదువుమాత్రము చెప్పించి, మాకు సమీపంలోవున్న రాజమండ్రిలో బి.ఏ. చదువుచున్న ఒకఅబ్బాయికి నన్నిచ్చి వివాహము చేశారు. కొద్దిరోజులు గడచినతరువాత, పెంచి పెద్దదానినిచేసిన నా తల్లి, దండ్రులను, సోదరవాత్సల్యముతో ఆడుచూ పాడుచూ పెరిగిన మాబావను, వదలి నేను మాఅత్తవారి యింటికి వెళ్లవలసివచ్చినది. అత్తవారియింటికివెళ్లిన 5, 6 నెలలకు మావారి చదువుపూర్తి అయి, కాకినాడలో ఉద్యోగము వచ్చుటచే, మేమిద్దరము ఒంటరిగావెళ్లి అచట వుండవలసి వచ్చినది. తరువాత మేమిద్దరముగూడ యెంతో అన్యోన్యానురాగముతో ఏవిధమైన అరమరలులేక, ఆనందమయంగా కాలంగడుపుచున్నాము. కాలచక్రము యెప్పుడూ ఒకేరీతిగా వుండదుగదా! అది యెంతటివారలకైనా అతీతం.

ఇంతలో నాతల్లిదండ్రులకు చాల జబ్బుగావున్నదని టెలిగ్రాము వచ్చుటచే, నేను, మా వారు కలసి మాపుట్టింటికి వెళ్లితిమి. మేము వెళ్లేలోపలే కలరాజాడ్యమువలన నాతల్లిదండ్రు లిరువురు మరణించిరి. 10 రోజులు గడచినఅనంతరం, మాబావ అక్కడ ఒక్కక్షణమైనా ఉండలేక, చదువు పూర్తిఅగుటచే యెక్కడనైనా 10 రూపాయలు సంపాదించుకొనెదనని వెళ్లిపోయినాడు. నేనుకూడ నాతల్లిదండ్రులులేని ఆగృహములో ఒక్కరోజయినా గడపజాలక వెంటనే నేను, మావారుకలసి కాకినాడకు వచ్చేశాము. ఇలావుంటూవుండగా మాయింటిప్రక్కన, బి. ఏ. చదువుచున్న ఒకఅమ్మాయి నాకు బాగాపరిచయమయి అప్పుడప్పుడూ మాయింటికివస్తూ యెంతో స్నేహంగా వుంటూవుండేది. వేసవిసెలవులిచ్చుటచే ప్రతిరోజూ మాయింటికివచ్చి న్యూస్‌పేపరు తీసుకొనివెళ్లి చదువుకొంటూ, పేపరువిషయాలు ముచ్చటించుతూ మావారినికూడ మాట్లాడిస్తూవుండేది. యిందుమూలమున మా •వారికికూడ బాగా పరిచయమయింది. రానురాను యీపరిచయమే మాకాపురమునకు

తీరని యిక్కట్టులు తెచ్చిపెట్టినది. మావారిచర్యలు అన్నీ గ్రహిస్తూనేవున్నాను. యింట్లో వున్నధనమంతా ఆఖరయినది. కొన్నినగలన్నీ ఆఖరయినాయి. చివరకు నామాటఅంటేనే సరిపడేదికాదు. ఒకరోజురాత్రి యింటికివచ్చేసరికి చాలప్రొద్దుపోయినది. తలుపుతీసి చూసే సరికి మనిషి మనస్సృహలోనే లేరు. రెండవ దురలవాటు త్రాగుడుకూడ అలవాటయిందని తెలుసుకొన్నాను. మరుసటిరోజు రాత్రికూడ యిదేమాదిరి మైకములోవచ్చి ఆ అర్థరాత్ర మున నన్ను "నీకు, నాకు యేవిధమైన సంబంధంలేదని" యింటినుండి తరిమివేశారు.

ఆ అర్థరాత్రియందు నన్నుకనికరించు కరుణామయులు ఎవ్వరుంటారు? హాదైవమా! నాగతియేమిటి, ఆపుట్టినటువంటి తల్లిదండ్రులాలేరు. చిన్ననాటనుండి సోదరవాత్సల్యముతో పెరిగిన బావయెక్కడవున్నదీ అంతేతెలియదే! విద్యవిపరీతముగా నేర్చినఫలితము, సుఖంగా గడుపుకొంటున్న మాబోటి కాపరములకు విచ్ఛిన్నము కలుగజేయుటేయని గ్రహించుట ముఖ్యాంశముకాబోలు. అనుకొంటూ రైలుస్టేషనుకువెళ్లి, నాదగ్గర మిగిలివున్న చిన్ని వుంగరమునుమార్చి ఆడబ్బుపెట్టి రాజమండ్రివెళ్లి, వూళ్లో మా మామగారికొరకు విచారించగా, నా నిర్భాగ్యస్థితికితగినట్లు అచట మామగారుకూడలేరు. అట్టిస్థితిలోవున్న నాయందు ఆదరణజూపువారెవరు! చేతిలో చిల్లిగవ్వఅయినాలేని నాబోటి అభాగ్యురాలు ఏసంస్థలోనయినాజేరి కుటీరపరిశ్రమల శిక్షణబొంది బ్రతుకుదామంటే ఉచితముగాజేరుటకు యెచట స్థానములేదుగదా! అనుకొని పగలంతా అలాగే ఆహారములేకుండగడపి, ఏవిధ మైన దారిలేక, సాయంత్రమువేళ గోదావరిబడ్డుకు వెళ్తూవుంటే, దారినపోతూ నాదీనావస్థను చూచి వారిపాటికివారు పోవుటేతప్ప నాసంగతి యెవ్వరికిపడుతుంది. అలాగే గోదావరిబడ్డుకు జేరి, ఓ మహాతల్లీ, నాబోటిఅభాగ్యజీవికి ప్రపంచంలో యెచటను స్థానములేదు. నీలోనైనా జేర్చుకొనెదవా? ఏమీ! నీకుకూడ పనికిరానా? అంటూ గుభాలున దూకేసరికి, వెంటనే యెవ్వరో 'ఆగు, ఆగు' అంటూ నాదరికివచ్చి నన్నుబయటికితీసిరి. ఆమహాత్ములెవరో భార్యా భర్తలిరువురు. నన్ను వారియింటికిజేర్చి, స్పృహవచ్చేవరకు పరిచర్యలుజేసి, తరువాత నేనీవిధముగా విరక్తిజెందుటకు మొదలైన కారణములుఅడుగగా అన్నియుజెప్పితిని.

తదుపరి వారినిగురించిన వివరములుగూడ అడుగగా, నాచిన్ననాటిబావ మధుసూ ధనగారు. ఒక్కసారి ఆశ్చర్యానందములు కలిగినవి. ఒకరినిఒకరు తెలుసుకొన్నతరువాత మాబావ, అక్కకూడ నన్నుయెంతో ఓదార్చినాకుయేదో ఒకదారి కలుగజేయవలెనని దీక్ష

వహించిరి. మాబావ రాజమండ్రిలో ప్రైవేటుప్రాక్టీసుపెట్టుకొని డాక్టరుగా వుంటూ వున్నాడు. అక్కకూడ బావకుతగిన సుగుణమంతురాలు. నాకు క్రమేణ ఓపికవచ్చేవరకు మందులువాడి, బాగా ఆరోగ్యము చేకూరినతరువాత నన్ను ఒకస్కూలులోజేర్చిరి. అలాగే నేనుకూడ అమితశ్రద్ధతో చదువుటచే కొద్దికాలములోనే యింటరుమీడియెట్ ప్యాసు కాగలిగితిని. వెంటనే మాబావ ఉద్యోగప్రయత్నము జేయగా, స్త్రీవిద్యా ప్రచారక్ శాఖకు నాయకురాలిగా, కాకినాడకు ఆర్డరువచ్చినది. మాబావ, అక్క అనుమతిమీద నేను కాకినాడవెళ్లాను.

కాకినాడలో నాకు యిల్లుయిచ్చి, నెలకు 150 రూ. లు జీతముయిచ్చుచున్నారు. యిలాగే ఒక సంవత్సరముగడపి కొంతడబ్బును నిలవజేసి, నాస్వయంకృషిచేతనే అనాధశరణాలయము అంటూపెట్టి, అందులో అనాధలైనటువంటి స్త్రీలకు విద్య పరిశ్రమలు మొదలైనవన్నీ ఉచితముగా నేర్పుటకు ఏర్పాటుచేయించితిని. యిలాకొన్నాళ్లుగడచిన తరువాత యీసంస్థలో పనిజేయుటకై, చీలికలగుడ్డలుకట్టుకొని, వాడిపోయిన మొఖముతో గేటుదగ్గర నిలబడివున్న మనిషినిజూచి, లోపలకుపిలువగా, వెంటనే నాభర్తేనని గ్రహించితిని. తదుపరి ఆయననుగురించిన వివరములుఅన్నీ అడుగగా, తనకష్టములు అన్నీ చెప్పి, ఏదైయినా చిన్నఉద్యోగముచేసి బ్రతుకుదామని వచ్చితిననిరి. తరువాత మీతోటి వుంటున్న ఆయువతి ఎచ్చటవున్నదని అడుగగా యీవూరిలోనే యెచటనో వున్నదనిచెప్పెను; ఆమెనుకూడ పిలిపించి, నేనుపెట్టిన సంస్థలోనే, యిద్దరకు• ఉద్యోగముఏర్పాటుజేసి, యిద్దరూ వుండుటకు ఒకయిల్లు ఏర్పాటుజేసితిని. యిలాంటి అనాధ స్త్రీ శరణాలయములకు ప్రత్యేక అవసరములుంటవని, వీటి స్థాపన, పోషణకు దేశనాయకులు పాటుపడాలని ప్రచారం చేస్తూవుండేదాన్ని. యీసంస్థకు అన్నివిధముల సహకారం యిస్తూ, వారితప్పిదమును మరవగలిగిన నాశక్తిని నా ఉదారస్వభావాన్ని నామిత్రులకు చెపుతూవుండేవారు. వీటన్నిటికి మాబావ నాకు యిప్పించగలిగిన విజ్ఞానభిక్షయే కారణంఅని సంతోషపడేదాన్ని.

నాజీవితమంతాకూడ యిలాగే సేవామార్గముక్రిందనే ఉపయోగిస్తూ, అనాధలైన స్త్రీలను రక్షిస్తూ, స్త్రీవిద్యావ్యాప్తికొరకు కృషిజేయుచున్నాను. నన్నీవిధముగా పైకితీసుకు రాగలిగిన మాబావకు, అక్కకు నాకృతజ్ఞతతెలుపుతూ, వారికి యెల్లప్పుడు ఆయురారోగ్యైశ్వర్యములనిచ్చి కాపాడుగాక! అని భగవానుని ప్రార్థిస్తూవుండేదాన్ని.





ఈ సారి

## గృహలక్ష్మి స్వర్ణకంకణము

## శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారికి

ఇవ్వబడును.

**7—3—1948**

సాయంకాలం 5 గంటలకు మదరాసు రాయపేటలో

కేసరికుటీరము నెం 15, వెస్ట్‌కాట్ రోడ్డున, ఈ ఉత్సవము జరుపబడును

ఎల్లరూ విచ్చేయ ప్రార్థితులు.

# మద్రాసు సంగీత కళాశాల ద్వితీయ వార్షికోత్సవము

గో పా ల పు ర ము.



చీఫ్‌జస్టిస్ గా॥ రాజమన్నారుగారి అధ్యక్షతను మద్రాసు సంగీతకళాశాల ద్వితీయవార్షికోత్సవము **25-12-47** న గోపాలపురమునందు విజయవంతముగా జరుపబడినది.

ప్రప్రథమమున కళాశాల వీణాబృందము శోభాయుతంగా వాయించిరి. తదుపరి అధ్యక్షులు మాట్లాడుచూ "పూర్వకాలమందు లలితకళాపోషణమే తమ ప్రథమకర్తవ్యముగా అప్పటిరాజులు తలంచిరి. అందుచేత నేటిప్రభుత్వమున్ను, విశ్వవిద్యాలయాలున్ను సంగీతాదిలలితకళలను సవతితల్లి ప్రేమతో చూడక తద్విషయాన్ని ప్రీతితోను, గౌరవంతోనుచూచి పోషిస్తారని తలుస్తాను" అన్నారు.

తరువాత "సరిగపాగాఇచ్చెరా—సాదాపాగాఇచ్చితి." అనే సంగీతనాటికను కళాశాలవిద్యార్థినులు అతిచాతుర్యంతో నటించారు. తంజావూరు మహారాజైన శరభోజీ మహారాజు తన మూడువందల ప్రఖ్యాతాస్థాన గాయకులలో మోహనరాగం అత్యంతరమ్యంగా పాడినగాయకునికి, చాలాసంతోషించి, మెచ్చి, తన జరీపాగాను రత్నమణిఖచితమైనదాన్ని తీసి బహుమానంచేస్తాడు; ఆ గాయకుడు ఆ బహుమానంచేసిన విషయాన్ని 'సరిగ పాగా ఇచ్చెరా' అని మోహనరాగములో స్వరాక్షరపల్లవిగా పాడుతాడు. మహారాజు కూడా గానకళావిదుడుగనుక చిత్రంగా సమాధానంచెప్పుతూ "సాదాపాగాఇచ్చితి" అనే స్వరాక్షరపల్లవి అదేరాగంలోపాడి పల్లవి పూర్తిచేస్తాడు. అదీ ఈ నాటకమూలం.

పిమ్మట శ్రీమతి ద్వారకాపార్థసారధి (ప్రిన్సిపాల్)గారు కళాశాల వార్షికనివేదికను చదివారు. నివేదికసారాంశం: 1946 లో ప్రారంభించిన యీ కళాశాల 1947 లో చాలాశీఘ్రంగా అభివృద్ధిచెందింది. ఈ కళాశాల విద్యార్థులు చాలాప్రవీణతతో గాంధీజయంతి, మున్నగు సందర్భాలలో ఆర్కెస్ట్రాజరిపి మెప్పుబడసియున్నారు. ఈ కళాశాల ప్రధానాశయం విద్యార్థి విద్యార్థినుల ఉత్సాహముల ననుసరించి ఒక్కొక్కవ్యక్తికి ప్రత్యేకశిక్షణ ఇచ్చుట. ఆ విధముగాచెప్పిననే వారిప్రత్యేకప్రతిభలు ప్రకాశించడానికి వీలుండును. దీనితర్వాత గాత్రబృందము ఫిడేలుబృందము కచ్చేరీలు గావించిరి. పిమ్మట ఒకచక్కని 'సంగీతహాస్య ప్రహసనము' జరిగినది.

ఆ వెనుక ప్రొఫెసరు. పి. సాంబమూర్తిగారు 'స్వతంత్రభారతదేశంలో గానవిద్య'ను (Music in Independent India) గూర్చి మాట్లాడుచూ సంగీతోద్ధరణకొరకు లలితకళలకు ప్రత్యేకమంత్రివర్గములు కేంద్రప్రభుత్వమందునూ, రాష్ట్రప్రభుత్వమందునూ ఉండవలెను. సకల సంగీతవిషయాలలోను శిక్షణ ఇవ్వడానికి అన్నికాలేజీలలో ప్రత్యేకఏర్పాట్లున్ను ప్రతివిశ్వవిద్యాలయంలోనూ సంగీతపు ప్రత్యేకపరిషత్తున్ను (Faculty of Fine Arts) వుండాలి; ఇప్పుడు మన దేశానికి స్వతంత్రంవచ్చింది గనుక 'స్టేట్ బ్యాండ్' 'స్టేట్ ఆర్కెస్ట్రా' నడపాలి. మనపోలీస్, మిలిటరీ బ్యాండ్ యూరోపియన్ విధానము మానివేసి ఇండియన్ విధానము మాత్రమే వాయించేలాగ ప్రభుత్వం ఆదేశించాలి, ఇత్యాది ఉత్తమమైన సూచనలెన్నో చేసినారు. తరువాత 'ఆర్కెస్ట్రా', చాలా ఆనందదాయకముగా జరిగినది.

 

అధ్యక్షులవారు తుదిపలుకులలో "ఇట్టి సాహసంతో ప్రత్యేకంగా ప్రారంభించే సంస్థలకు ఆర్థికసహాయము చేయవలెననీ, అవిధంగా సమర్థులైన కళాకోవిదులకూ, అవిధంగా కళకూ సేవచేసి ఉద్ధరించవలెననీ" నుడివిరి.

చివరన శ్రీ ఎస్. సి. పార్థసారథిగారు (ప్రిన్సిపాల్) అధ్యక్షోపన్యాసకులు మున్నగు వారందరికీ అభివందన కృతజ్ఞతలు దెలిపిరి. పిదప మంగళం పాడబడెను.



క్రింద కూర్చున్నవారు:— ఆర్. సుగంధ; ధనలక్ష్మి; సి. శాంత; భారతి; భోజ; యస్. ఆర్. శాంతి.

కుర్చీలలో:— శాంతాబాయి; సుందరరాజయ్య; డా॥ త్రిమూర్తి; గౌ॥ న్యాయమూర్తి రాజమన్నారుగారు. (అధ్యక్షులు); ప్రొ॥పి. సాంబమూర్తి, యన్. సి. పార్థసారథి; శ్రీమతి యన్.సి. ద్వారకా పార్థసారథి; (ఆచార్యులు).

నిలుచున్నవారు: 1-వ వరుస:- జి. మీనాక్షి; ఆర్. చంపకలక్ష్మి; యస్. సీత; బి. శాంత; పి. లీలావతి కె. సరోజ; యన్. సి. సీత.

,, రెండవ వరుస:- యస్. ఆర్. రాజం; యమ్. శారద; యమ్. శాలిని; యమ్. పద్మిని; కె. సరస్వతి సి. జయకుమారి; ఆర్. అవ్వాంబాళ్; యమ్. కమల; యల్. వి. సరస్వతి.






1948 జనవరి-12-తేది :—

మద్రాసు కేరళ సమాజమువారి యాజమాన్యమున మళయాళ మహిళా సభ జరిగినది.

,, 12 ,, అంతర్జాతీయ సోషలిస్టు మహాసభకు శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారు భారత సోషలిస్టుపార్టీ ప్రతినిధిగా వెళ్లుటకు తీర్మానింపబడినది.

,, 12 ,, బీరారు రాకుమారి (నైజాము కోడలు) ఇస్తాంబుల్ నుండి విమానముపై వచ్చి కరాచీలో దిగినది.

,, 13 ,, భారతదేశమందు మతకలహము అంతరించుటకై మహాత్మాగాంధీ నిరాహారదీక్ష పూనినాడు.

,, 14 ,, యుద్ధకాలమున స్వదేశీయులను జర్మనులకు వెల్లడించి ద్రోహమొనర్చిన నేరానికి—ఒక డచ్ యువతి మరణశిక్ష అనుభవించినది.

,, 16 ,, జమ్మూలో అపహరింపబడిన స్త్రీలను సంరక్షించుటకు కాశ్మీర ప్రభుత్వము స్పెషల్ ఆఫీసరును నియమించినది.

,, 18 ,, గాంధీ మహాత్ముడు తగిన హామీపై— నిరాహారదీక్ష వదలినాడు.

,, 20 ,, శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ ఎం. ఎల్. ఏ గారిని మద్రాసు సిటి ట్రాన్స్పోర్టు అడ్వైజరీ బోర్డులో సభ్యురాలుగా ప్రభుత్వమువారు నియమించినారు.

,, 20 ,, మద్రాసు శాసనసభ (అసెంబ్లీ స్పీకరు గారు తానులేనప్పుడు అధ్యక్షత వహింపవలసినదిగా - (శాసనసభ సమావేశమున) నలుగురిని నిర్ణయించిరి. వారిలో శ్రీమతి బేగం అమీరుద్దీన్ ఎం.ఎల్. ఏ గారొకరు.

,, 22 ,, మద్రాసు ఫిల్ము సెన్సార్ బోర్డులో శ్రీమతి దుర్గాబాయి గారిని, శ్రీమతి మీనాంబాళ్ శివరాజ్ గారిని క్రొత్త సభ్యులుగా ప్రభుత్వము నియమించినది.

,, 23 ,, మద్రాసు గవర్నరు కుమార్తె స్టీవెన్సుకన్య పెరియమెట్‌లోనున్న కార్పొరేషన్ బాలుర పాఠశాలను దర్శించినది.

,, 24 ,, మతకలహాల్లో అపహరింపబడిన స్త్రీల విషయమై గాంధీ ప్రార్థన సమావేశమందు ప్రస్తావించినారు.
పైవిషయమై ప్రస్తావింపను గాంధీగారి శిష్యురాలు డా॥ సుశీలానయర్ పాకిస్థానమునకువెళ్లి పాకిస్థాన్ మంత్రి ఘజనఫర్ ఆలీగార్ని చూచినది.

,, 25 ,, మునగాల సంస్థానమందలి అన్నవరం గ్రామంలో నైజాము సరిహద్దు సమీపమున నలుగురాడువారు పనిచేయుచుండగా ఆవలివైపు నైజాము పోలీసులు వారిని తమవైపు లాగుకొనివెళ్లి తన్ని పంపినారని యఫ్. ఓ. సి. వార్త.

,, 27 ,, మౌంట్‌బాటన్‌సతి భర్త (భారతయూనియన్ గవర్నర్ జనరల్)తో గూడి మద్రాసునకు విచ్చేసిరి.

,, 28 ,, మతకలహములందు స్త్రీలను అపహరించుకొనిపోవుట నిలిపివేయవలయునని కోరుచు మౌంట్‌బాటన్‌సతి, రాకుమారి అమృతకౌర్ సరోజనీనాయుడు ప్రభృతులు ప్రకటన చేసినారు.

,, 28 } ,, 29 } మౌంట్‌బాటన్‌సతి చెన్ననగరమున గల వివిధ స్త్రీల సంస్థల దర్శించినది.

,, 30 ,, గాంధీమహాత్ముని ఈ సాయంకాలం 5 గంటలకు ప్రార్థనవేదికవద్ద ఒక యువకుడు పిస్తోలుతో కాల్చి చంపినాడు.

,, 30 ,, మౌంట్ బాటన్ సతి వెల్లూరు వెళ్లి వచ్చినది.

,, 31 ,, 10 లక్షల జనము విలపింపగా మహాత్ముని కళేబరము యమునా తీరంలో దహింపబడినది.

,, 31 ,, మౌంట్ బాటన్ సతి మద్రాసులో కార్యక్రమమంతయు విరమించుకొని మహాత్ముని తుది దర్శనానికని ఢిల్లీకి విమానంమీద వెళ్లినది.

1948 ఫిబ్రవరి-2-వ తేది : —

మహాత్ముని చితిసంచయనము జరిగినది.

,, 5 ,, మహాత్ముని అస్థులు చితిభస్మను మద్రాసు గవర్నరుగారిచే విమానముపై మద్రాసు తీసుకొని రాబడినవి.

,, 6 ,, బాంక్విటింగ్ హాలులో నుంచబడిన మహాత్ముని అస్థిభస్మములను నగరవాసులు వేలకొలదిగా దర్శించుచున్నారు.

,, 5 ,, దేశమంతటా రాష్ట్రీయ స్వయంసేవక సంఘాధికార్లను సభ్యులను పలువురను మహాత్ముని హత్యాసందర్భమున అరెస్టు చేయుచున్నారు. వీరిలో బొంబాయి యందు 4 గురు స్త్రీలును అరెస్టుచేయబడినారు.

,, 5 ,, శ్రీమతి అరుణ అసఫాలీ అమెరికానుండి లండనుమీదుగా విమానముపై ఢిల్లీకి వచ్చినది.



## మనవి

చందాదారులు విలాసములు మారినప్పుడు చందాలు పంపునప్పుడు, ఇతర సందర్భములయందు వారిచందా నెంబర్లు తెలియపరచిన వెంటనే సమాధానములు ఒడయుటకు వీలగును.

# సంపాదకీయములు

## ప్రయాణ సౌకర్యముల సలహా కమిటీ—స్త్రీ సభ్యత్వము

చెన్నపట్నంలో ప్రయాణసౌకర్యములగూర్చి ప్రభుత్వమునకు సలహాయిచ్చే సంఘములో శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ ఎం ఎల్ ఏ గారిని సభ్యురాలినిగా ప్రభుత్వమువారు నియమించినందులకు వారినభినందిస్తున్నాము శ్రీమతి సీతామహాలక్ష్మమ్మగారు తమవిధిని పూర్తిగా నిర్వహింపగల సమర్థురాలని మాకు విశ్వాసమే ముఖ్యంగా ఆమె గమనించవలసిన విషయములు హెచ్చుత్రొక్కిడిగల బస్సుట్రాం స్టాండులలో నిర్బంధముగా "క్యూ" పద్ధతి నేర్పరచడం, బొంబాయి కలకత్తాలలోవలె, బస్సులలో ట్రాములలో స్త్రీలకు హెచ్చుస్థానములు ప్రత్యేకించి-వారులేనప్పుడే పురుషులాక్రమింపవచ్చునని, వారు రాగానే పురుషులు కాళీచేయవలయునని నియమమేర్పరచడం, హెచ్చుకాలం బస్సుట్రాములకై వేచియుండవలసిన స్టాండులలో ఆచ్ఛాదనము, కూర్చుండే ఏర్పాట్లు చేయించడం, బస్సు కండక్టరైన కుర్రవాండ్రు యువతులను అపహాస్యంచేయకుండా చూడడం, బస్సుట్రాం టిక్కట్లలోను, బస్సుట్రాంబండ్లలోను-ప్రయాణీకులకు తెలియగలందులకు ప్రచురించేసంగతులు తమిళంతోపాటు తెలుగులోకూడా వేయించడం, వీటన్నిటినీ ఆమె గమనించి గట్టిగా కృషిచేయునని ఆశిస్తున్నాము

## పారసీకస్త్రీలు-బురఖా

మతగురువులకు సంఘసంస్కరణఅంటే తలనొప్పి వారిని కాదనే ప్రపంచంలో నేటికిజరిగిన సంస్కరణలన్నీ సాగినవి అయినావారు వేలువంకబెట్టక ఊరుకోరు. పారసీకదేశంలో అన్ని ముస్లింరాజ్యాలలో వలెనే స్త్రీలు బురఖావేసుకోడం పూర్వాచారము కాని ప్రస్తుతం పారసీకమేలుతున్న షా తండ్రి రెజాషా పహల్వి 8-1-1936 న ఈ బురఖానియమమును రద్దుపరచినాడు ఆ రోజున టెహరాన్ విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవంలో ఆయనభార్య, కుమార్తెలిద్దరు ప్రథమంగా బురఖాలేకుండా ఆ ఉత్సవంలో పాల్గొన్నారు దానినుండి క్రమంగా "బురఖా" వేసుకున్నస్త్రీకి సంఘంలో స్థానంలేకుండాపోయినది చాలమంది బురఖాతీశేశారు అయితేనేడు 15 గురు ఇస్లాంధర్మవేత్తలు బయలుదేరివారు, వారికి మహమ్మద్ వంశస్థుడట-ఆయన నాయకత్వము వహించినాడు స్త్రీలు బురఖాలువేసుకోకుండా చీలమండలు, మణికట్లు చూపేసరికి, పురుషులకు ఎక్కడలేని ఉద్రేకం పుట్టుకవస్తుందట, దీనికి తృప్తిదాయకమైన పరిహారంమాత్రం ఉండదట! ఇంతనీచమైన అభిప్రాయాన్ని మతంపేరట వీరు ప్రకటించగలిగినారుగాని మరెవ్వరు చేయజాలరు. ఈ ప్రయత్నం విదేశప్రభుత్వపు ప్రోత్సాహంవల్ల జరుగుతున్నదని యొకపత్రికవారిదేశంలోవ్రాసినది. ఏమైనా ఈ 12 సం॥ లుగా శుభ్రమైనగాలిపీల్చి, స్వేచ్ఛననుభవించిన పారసీకస్త్రీలు ధైర్యముగా నిలువబడి పోరాడుతారని ఆశిస్తున్నాను. వారిపత్రికలు స్త్రీలకు ఓట్లుప్రాతినిధ్యముకూడా అడుగుతున్నాయి. కాబట్టి వారాపని నెరవేరుస్తారని మాధైర్యం




## శ్రీ రమణాశ్రమ లేఖలు:

శ్రీమతి నాగమ్మగారిచే వ్రాయబడినది. ప్రకాశకులు: నిరంజనానందస్వామి, శ్రీ రమణాశ్రమము తిరువణ్ణామల. వెల రూ 1-4-0.

వేదాంతసారాన్ని అనుభవంమీద ఆచరణరూపేణా ఉపదేసిస్తున్న శ్రీ రమణమహర్షివారి సందేశాలను చక్కగా, సులభమైన శైలిలో, సుబోధకంగా వుండునట్లు శ్రీమతి నాగమ్మగారువ్రాశారు. వీరు చాలాకాలం శ్రీవారి సాన్నిధ్యమునవుండి అందలి ఆధ్యాత్మికాదర్శ విశేషాలను తనసోదరునకు లేఖలమూలకంగా తెలిపిన విషయములను పుస్తకరూపంలో ప్రకటించారు. మహనీయుల పవిత్రచరిత్రాంశములను తెలిసికొని వారిబోధనలను స్మృతికీదెచ్చుకొనుటకంటె ఆధ్యాత్మికోన్నతికి సుగమమగు వేరుమార్గమేది?

శ్రీ రమణమహర్షులవారి ఉపదేశాలకు ఇతరగురువుల ఉపదేశాలకు భేదమున్నది. వీరిఉపదేశాలలో దురవగాహమైన వేదాంత పారిభాషిక పదజాలముతోగూడిన సిద్ధాంతరాద్ధాంతాలుండవు; కఠినమైన సాధనక్రమమును వీరు నియమించరు. సులభంగా, సూక్ష్మంగా, సూటిగా—‘నేను అంటే ఎవరు?. ఎక్కడనుంచి, ఎందుకు ఎప్పుడు ఏర్పడ్డాను?” అని ప్రశ్నించుకొని యోచించమంటారు.”—అదే వీరి ఆధ్యాత్మికతత్వసారం.

భగవదంశాసంభూతుల దర్శనభాగ్యముకలిగి, వారిఉపదేశములను అవగాహన చేసికొనుటయే జన్మసార్థకత. ఈగ్రంథమును చదువుటలో ఆ పారమార్థికత కలుగు ననుటకు సందేహములేదు.




Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.